*This book is most respectfully*

*Dedicated to*

REV. L. W. SLIFER, M.A., B.D.,

MISSIONARY, REPALLE TQ.

*By the*

*Author.*

# FOREWARD.

The Lutheran Church was founded on stead fast faith in Jesus Christ as the only Redeemer of men and in the Bible as the true word of God. That Church became great through her fearlessness in confessing before men these two great articles of her faith·

It is the hope of those who have to do with this little book that the Lutheran Church in the Andhra country may be inspired by the example of Martin Luther found herein to fearlessly confess before the men of India that Jesus Christ is the only Redeemer of men and that the Bible is the true word of God.

Repalli, 3-2-31. (Sd.) **Luther W. Slifer, M.A., B.D.,**
Missionary.

# OPINION.

It is with great pleasure that I testify about the author of this booklet, Sridhara Ramamoorty who has been working as a Telugu Pandit for the past 5 years in our H. E. School for boys Repalle devotes his spare time in writing stories suitable for dramtization. He has written very recently a book on 'Martin Luther's Reformation. I have gone through his manuscript and I am of opinion that it is the latest and most comprehensive work on the subject suitable for dramas in Telugu which is badly wanting among Telugu Lutherans for a long time. The style adopted in the book is quite pleasing.

I wish him and the book every success.

Realle, 1-2 31. K. DAVID,
HEAD MASTER,
H. E. S. Repalle.

# పీఠిక.

సదయహృదయులగు నోపాఠకమహాశయులారా! నేనిప్పటికైదు వత్సరములనుండి యీ పాఠశాలయందుపాధ్యాయ పదవియందుండి క్రైస్తవ సోదరులాచరించు పండుగలకేగుచు విషయముల నాకర్షించుచుంటిని. తదాది దీనుబాంధుఁజేసిన మార్టిన్ ఫ్రాన్కు చరిత్ర నెచ్చట గాన రాకుండుటచే నద్దాని నిక్కోలాను సారముగ. క్రైస్తవుల హృదయాకర్షణ మొనర్చునవి నాటకములే గాన, నాటకరూపకముగా రచింప సంకల్పించియుండ మిషనరీ గారు Rev. L. W. Slifer M. A. B. D. దొరగారు హిబ్రూభాషయందున్న లూథరుచరిత్ర నొసంగిరి. దానినంతయుఁ జదివి యీగ్రంథము రచించితిని. దీనిని వ్రాయుటలో పాస్టరుగారగు పి. యోసేపుగారును, యీ పాఠశాలోపాధ్యాయులగు K. David G. Danial అనువారలు నాకమితోత్సాహము గల్పించిరి. తుదకు దినుబాలు పండుగనాడు, దీనిని పెక్కుమంది సమక్షమున కాలక్షేపమొనర్చితిని. నాఁటి విద్యార్థులగు పి. బి షాలుగారు జె. ప్రేమయ్యగారు Rev. స్లైఫరు దంపతులాదిగాగలవారాలకించి యొకస్వర్ణపతకమొసఁగి ముద్రణకు సహాయమొనర్తుమని వాగ్దానమొసగిరి. వీరికి నాకృతజ్ఞతా నమస్కృతులు చెల్లించుచున్నాను. పాఠకులు దీనిని చక్కగాచదివి పరిదర్శించి జ్ఞానము లోకమున వెల్లడింతురని నమ్ముచున్నాను. ఇందలి దోసఁగుల తెలియఁజేసిన పునర్ముద్రణమునందు దిద్దుకొనువాడను, దీని భాగములుగాని, సంపూర్ణవిషయములుగాని యితరులు గైకొనరాదు. దీనిని ముద్రించుటకు సహాయులైన, మిషనరీవారి కెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

గ్రంథకర్త.

N. B. ఈ నాటకసంబంధమగు కీర్తనలు వేరొకపుస్తకముగా ప్రకటింపగలను.

అన్నవరము,
21-1-31.

గ్రంథకర్త.

# తొలిపలుకు.

లూథరన్ సంఘము, యేసుక్రీస్తొక్కఁడే మానవరక్షకుఁ డనియు, బైబిలు దేవునివాక్యములఁ దెల్పుగ్రంథమనియు, నను, నీరెండునమ్మకములమీఁద నాధారపడియున్నది. అట్టి సంఘము నిర్భీతితో, మానవులయొద్ద, నారెండుసత్యవిషయముల నొప్పుకొనుటచే, నెంతయో నభివృద్ధిఁగాంచినది.

ఈచిన్నిపొత్తముఁ జదువువారాంధ్రదేశమునందలి, లూథరన్సంఘము, యీపొత్తమునందు వివరింపఁబడినటుల, మార్టిన్లూథరుపోల్కి, హిందూప్రజల సమక్షమున నేను క్రీస్తే రక్షణకర్తయనియు, వేదగ్రంథమే దేవునివాక్యమనియు నిర్భీతితో నొప్పుకొనను దేశింపవలయునని తలంపవలెను.

రేపల్లె, 3-2-1931. (సైన్డ్) లూథర్. డబ్లియు. స్లైఫర్.
యం. ఎ. బి. డి. మిషనరీ.

---

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 11 | 10 | గల్పింకనమ్ము | గల్పింపకనమ్ము |
| 15 | 20 | శకఁడ | శకుఁడ |
| ,, | 21 | నురితాత్ముఁడని | నురితాడుమ్ముఁడనని |
| 17 | 7 | గోరునట్లును. | గోరునట్లును, |
| ,, | 8 | వ్రాయుదు | వ్రాయుడు. |
| ,, | 18 | వలసినదే. | వలసినదే! |
| ,, | 15 | వలయు | వలయు. |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 22 | 8 | వైరులారసర్వసామాన్య) | వైరులార సర్వసామాన్య |
| 23 | 14 | జూదనపార | జూడనపార |
| 34 | 3 | శావచ్య | నావచః |
| ,, | 6 | చందమగు గాన | మగుగాన |
| ,, | 13 | ల్వినిలోలు | ల్వినిలోలు |
| ,, | 18 | ాచారములస్పష్ఠించుట | లాచారములనుష్ఠించుట |
| 35 | 2 | పోవ్రుసు | పోవ్రును |
| ,, | 19 | సహాయని | నహాయని |
| 37 | 8 | గూర్చియుంటి | గూర్చియుంట |
| 41 | 9 | కుండునే | కుంమునే |
| 42 | 16 | గ్రంథముల | గ్రంథములు |
| 43 | [illegible] | యిచ్చుటనసంభవ | యిచ్చుటసంభవ |
| ,, | 18 | సిదపరచెద | సిరపరచెద |
| 46 | 2 | మొనరించు | మొనరించుచు |
| 53 | 19 | యాసమయమును | యాసనమును |
| 56 | 16 | జేయ | జేయు |
| 57 | 8 | నింత | నింతి |
| ,, | 18 | సుఖంబునొంద | సుఖంబులనొంద |
| 60 | 2 | లీరు | వీరు |
| 62 | 21 | మానవపుత్రుడవే | మానవమాత్రుడవే |
| 63 | 5 | యుంచునకీర్తను | యుంచుటనకీర్తము |
| 64 | 4 | జెగ | జేర |
| ,, | 14 | లూధలార్యని | లూధరార్యని |
| 66 | 18 | దీనజనావనావనుడ | దీనజనావనుడ |
| ,, | 22 | విడువబోక | విడబోక |
| 67 | 6 | నాత్మకు | యాత్మకు |
| ,, | 10 | మీరెవ్వరు? | మీరెవ్వరు, |



# హార్టిస్ లాధరు.

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము.

[ ప్రవేశము: హారిస్సు. ]

గీ॥ ఐహికాముష్మిక సుఖంబుల కానవడని
కతన సత్త్వమయంబయి క్రాలుకతన
నాత్మవిజ్ఞాన కారణమైన కతన
ప్రేమ నిష్కామ సాత్త్వికప్రేమ యయ్యె॥"

అనికదా నొక కవీశ్వరుఁడు వచించె. నిర్మలమై, యనంతమై, సాత్త్వికమై, ప్రతిఫలశూన్యమై, దేహావివశత్వమును గలిగించు ప్రేమయే ప్రేమ. అందుననే మదీయమానసిక సింహాసనాధిష్ఠిత రాజ్ఞియనఁదగు మార్గరేటును వరించి యానందవీచికలం దోలలాడుచుంటి. (విచారము నభినయించి) ఆహా

కులానుగత యాచారధర్మము లేరికిని మీఱరానివిగదా. అగ్ర సుతుఁడు జీవింప మరియొకమార్గము నెమకవలయునట. కని ష్ఠుడు తండ్రియాస్తి ననుభవింపవలయునఁట. అందుననేగదా యిట్లు భార్యాసమేతుఁడనై మాన్స్ఫీల్డు దేశమునకుఁ బ్రయాణమైతి. ఇంతవర కేగ్రామమునుఁ జేరకుంటిని. సుకుమార శరీరిణియగు నాగృహిణి మార్గాయాసముచే సుక్కి యడుగులు తడబడ నెన్నడుమువడఁక మార్గశ్రమను బాపుకొనుటకు, పలుమరు మదీయ కరగ్రహణ మొనర్చి యెద్దియో ప్రశ్నించునట్లు నన్నాపి యలసట దీర్చుకొనుచున్నది. అల్లదే భానుఁడస్త్రాద్రి నలంకరించుచున్నాఁడు.

సీ॥ వినువీధిఁ జరియించి, పెను వేసటనుబొంది
నపరాబ్ధిలో స్నానమాడె యినుఁడు
పవలు కూలింజేసి భార్యాపుత్రులఁ జేర
పాంథు లల్లదె సాగువారి రకట
నాహారములకేగి హాయిగా ఖగములుఁ
జేరుచుండెను తమ చెట్లచెంత
తనజంటవీడిన పెనువంత మదినుంట
చక్రవాకము గుందసాగెనకట
గీ॥ యామినీకాంత నెమ్మెన నవధరించు
ముత్తెపుంసరు లనంగను గుత్తముగను
యుడుగణంబులు వినువీధి నుద్భవించెఁ
దమము పొడసూపె నింక నేదారి నాకు॥

ప్రథమాంకము.

అల్లదే నాపాంథునడిగి సమీపమున గ్రామమేదయిన నున్న దేమోయనుఁగొనెద. ఆర్యా సమీపగ్రామమేది? (వినుట నభినయించి) ఏమనుచున్నారు? ఎర్లిబెన్ననియా, అట్లయిన త్వరలో పోవుదము. (నిష్క్రమించి మరల ప్రవేశించును.) ఆహా! భూతలంబుననున్న కష్టజాలంబులన్నియు నన్నే వరించి నట్లున్నది.

గీ॥ తమము బర్వెన భీతిచే తరుణ నేను
యిచటికినిఁ జేరనిప్పుడే యింతి ప్రసవ
వేదనను బొందుచుండె నివ్వేళ నాకు
యేదుదిక్కయి బోతురో నెరుగరాదు॥

సీ॥ గాలిసోకుటచేతఁ గాయంబు గందంగ
పెనువెతలొందెడి భీతహారిణ
సూర్యాతపముచేత సోలి పాన్పునబండి
నిట్టూర్పుబుచ్చెడి నెలతమిన్న
చిగురుటాకులమెక్కి చెలగికోయల కూయ
కడుభీతి నొందెడు కమలనయన
మధుపానమున మేనుమరచి మధుపముఁ బాడ
ననుఁజేరి బెదరెడు నళిననేత్రి

గీ॥ సుగుణములరాశి మార్గరట్శోభనాంగి
ప్రసవ వేదననొందుచు బాధపడఁగ
కఠినపాషాణ సదృశంబు గాకయున్న
నాదుహృదయంబు శోకాగ్ని నవయకున్నె.

(వికటపటభినయించి) ఏమా కోలాహలము. (సంతోషముతో) పుత్రజననోత్సవ వార్త లాలించి ధన్యుడనైతిఁగదా. సకల దయాపరిపూర్ణ సాంద్రుడగు నాప్రభుమహిమ లేరికి వినఁగనుగొన శక్యమే. తనయుని కనులారఁగాంచి యానందించి బాప్తిజ మిప్పించెదగాక. (నిష్క్రమించి బాలునితోను, యాచార్యులతోను ప్రవేశించును) అయ్యలారా! మదీయసుతునకుబాప్తిజ మిప్పించి నన్ను ధన్యునిఁజేయ ముకుళితకరకమలుండనై ప్రార్థించుచున్నాడ.

ఆచా—(బాలునిఁ జూచి) ధన్యోస్మి! ధన్యోస్మి! ఇట్టి సుతుఁ గాంచిన తండ్రియే ధన్యుఁడు. ఆర్యా! యీకుఱ్ఱవాని భవిష్యద్దశ దెల్పెద వినుఁడు.

ఉ. ఈతఁడు సర్వభూజను లహీనతముదంబునఁ దన్నుగొల్వఁగా
నాతతకీర్తినింగని యసారతమూ ప్రభుసేవసేసి ని
ర్ధూతము సేయు కోమలక నిరూపక సర్వజనాళిద్రోహముల్
యేతదుకారణంబునను నిచ్చితి మార్టినుపేరు వీనికిన్.

మరియు,

గీ. మార్టినని మెడ్డి యోగీశు మృతదినంబు
గావునను నేను యీపేరు కరముయొప్పె
ప్రభువు దీవనలొందుచు బాలుఁడయ్య
సర్వమహిమాంచితుండయి నుర్విఁ జెలఁగు.

హా—ఆర్యులారా! నిదియంతయు భగవత్ప్రసాదము.

(తెర వ్రాలును.)

## —♦ ద్వితీయ రంగము ♦—

( ప్రవేశము: మార్టిన్—యర్ ఫర్టునుండి వచ్చు త్రోవ. )

ఆహా! రోమకమతసన్యాసులు పుణ్యులుగదా! వారి దర్శనభాగ్య మెన్నఁటికైన నాకబ్బునా? ఉపవాసములు, వ్రతములు నాచరించి పరమపదవి నెన్నఁటికైనఁ జూరగొందునా? దైవకృప యెటులనోగదా!

సీ. ప్రభుసేవఁ గావించి పతితపావనుఁడనై
పరమపదంబునుఁ బడయుటెపుడో
మనమున సర్వేశు మానకఁ గొల్చుచు
మోక్షరాజ్యంబున మునుఁగుటెపుడో
నుపవాసవ్రతముల నపచారములు వాసి
సర్వేశు చెంతకు సనుట యెపుడో
సతతంబు శ్రీయేసు స్మరణఁజేయుచు నేను
పాపపుంజంబులఁ బాయుటెపుడో
గీ. యెట్టి ధన్యులో మతములనిట్టలగుచు
నాత్మవిజ్ఞాన మొందెదు హార్షమతులు
నట్టి భాగ్యంబు పట్టునో పట్టకున్నొ
దేవుఁ డేవిధి నడపునో తెలియరాదు.

ఆహా! యర్ ఫర్టుదేశమున ప్లేగు సంభవించుటచే పెక్కుండ్రు విద్యార్థులు మరణింప, నీవిద్య మోక్షవిద్యగాదని మదికి దోఁచినంత స్వగృహోన్ముఖుండనైతి. (నలుదెసల బరి

కించి) వినువీధి కారుమేఘము లావరించినవి. జంఝామారుత మల్లడె సాగినది. అశనిపాతంబులు పడునేమోగదా! ఆహా! తలఁచినంత యైనది.

సీ. దశదిశాంతర్భాగ వశవర్తియై వారి
ధారలు మినునుండి తెరలుచుండె
కన్నులు మిరుమిట్లుగల్గ విద్యుద్దీప
కాంతుల మెరుపులుఁ గదలసాగె
ప్రళయవాతము రేగి ప్రళయమా యనుమాడ్కి
ఘనవృక్షముల నేలఁ గలుపుచుండె
సకల దిగ్వేదండ శ్రవణపాతములన
నశనిపాతంబులు నడరుగొల్పె
గీ. కన్నుబొడిచిన వస్తువు గ్గానరాక
తమము జగమందు బర్వెనుదగ్రముగను
నొంటి, కుజ్జను మార్గంబునుంటి నిపుడు
భీతి హృదయంబునందున పెనచివైచె.

ఓరక్షకా! ప్రభువా! యాపన్నరక్షణదీక్షాబద్ధకంకణుండవగు నీవు నన్నీ విపదాంబుధినుండి యుద్ధరింపవా? అన్నా! యోగివర్యా! ఇదియే మదీయ ప్రతిజ్ఞ వినుము.

కం. దిటముగ నీదయ నేనిటు
కటువగు విపదాబ్ధినుండి గడచితినేనిక
యటమటలేమియు నొందక
పటుతరముగ యోగినౌచుఁ బరివర్తింతుక.

(ధ్యానించును.)

ఆహా! దేవతామహిమ! ఇట్టి యనన్యసామాన్యమహిమ లుండుటచేతనే ప్రజలకు వానియందు విశ్వాసము మెండు. ఈగండము గడచినది. ఇక స్వజనులచే సెలవొంది యోగినై మఠమునందుండుటయే కర్తవ్యము. (నిష్క్ర॥) తెరపడును.



## —♦ తృతీయ రంగము ♦—

[ సీను: రోమునగరము; ప్రవేశము: మార్టిన్, అతని మిత్రుఁడు, ]

మి—మార్టిన్! ఏమట్లు యాలోచనాపరుఁడవై యుంటివి?

మా—మిత్రమా! ఇచ్చటి రోమను కెతోలిక్ చర్చివారి యాచారములులాదిగాఁగలవి నాకాశ్చర్యముఁ గలిగించుచు నన్నొక మూఢునిఁ జేయుచున్నవి.

మి—(నవ్వుచు) దానికేనా నాశ్చర్యము! గతము విచారించిన మరియు నాశ్చర్యముఁ బొందుదువు.

మా—(సంభ్రమముతో) అటులయిన వానిని నాకు దెలుపవా మిత్రమా?

మి—తెల్పెద నాకర్ణింపుము. పాపక్షమము పాపులయందే యుండెను. తమ పాపములనొప్పుకొనినవారు చరితార్థులగుదురట! అట్టివారు రోము మొదలగు పుణ్యక్షేత్రములకు యాత్ర సలుపవలెనట.

మా—ఆశ్చర్యమాశ్చర్యము! వింతలపై వింతలు పొడసూపుచున్నవే?

మి—ఇంతియేనా! యిటు వినుము. అన్యులతో నసఁగా విమతస్తులతో సంగరమొనర్చి యసువులఁబాసిన వీరస్వర్గమొందుదురని మహమ్మదు ప్రవక్త బోధించెను. అటులనే నాల్గవ లూయి, 856 సంవత్సరమున మహమ్మదీయులతోఁ బోరు క్రైస్తవులు మోక్షమొందుదురని ప్రకటించెను. తదుపరి 8వ జాన్ సైన్యములో చేరినవారికే మోక్షమనెను. ఇటులనే 9వ లూయి, 2 వ అర్బను మొదలగువారు 1095 వరకీయాచారమునే నడపిరి. అపయి నొక సిపాయికగు వ్యయమొసంగినంతనే వాని పాపములు క్షమియింపఁబడుననిరి. ఇది 1146 ప్రాంతముల నిర్వచింపఁబడెను.

మా—(విసువుతో) ఛీ! ఏమి మాధ్యము?

మి—ఇంతట నయినదనుకొంటివా? క్రూసుయుద్ధము లంతరించిననాట, 1300 సంవత్సరమున పోపగు 8 వ బోనిఫేసు జూబిలీదినములలో రోమునకు యాత్రనొనర్చువారి పాపములు క్షమింపఁబడుననెను. అందున పెక్కు లొక్కమ్ము క్షమకూడుటచే సత్కార్యమునకింటఁగూర్చుండియైన ధనమొసంగువారి పాపములు క్షమియింపఁబడుననెను.

మా—(క్రోధముతో) ప్రభువా! నీమహిమ లెంత మాటు చేయుబడుచున్నవి. నీచళక్తులెంత ఘనతవహించుచున్నవి.

మి—మార్టిన్! హృదయావేదము నొందక సాంగముగా వినుము. 1393 సంవత్సరమున 9వ బోనిఫేసు పీటరుచర్చి నిర్మించుటకుఁ దలపెట్టి తన చీటులను కొన్నవారి పాపములు క్షమింపఁబడుననెను. ఆత్మలను పాపప్రక్షాళనము చేయుటకుఁ దమ కధికారముగలదనిరి.

మా—(హృదయావేగముతో) కాలమా! ఎంతలో నెంత మార్పునొందితివి? క్రూరత్వమా! నీవెంత ఘనతవహించితివి. పాపమా! నీవెంత సులభముగ రూపుమాయుచుంటివి? దుర్భరము! దుర్భరము! దుర్భరము! పాపక్షమాపణచీట్ల నమ్మట పుణ్యవ్యాపారమా?

సీ. సకలాంతర్యామియై సర్వంబు వీక్షించి
సత్యంబు నెరిఁగెడు సరసుఁడుండ
జగమెల్ల సృజియించి జగములఁ బోషించి
సర్వంబు రక్షించు శాంతుఁడుండ
పంచభూతంబుల పగలు రేయియుఁ జేసి
సౌఖ్యంబు నొడగూర్చు శూరుఁడుండ
నాత్మరక్షణనిచ్చి యనిశంబు గాపాడి
దివ్యామృతముఁ జల్లు దేవుఁడుండ

గీ. ధనమె దైవంబుగా మదిఁ దలఁచుచుండి
తామె దైవంబుకంటెనుఁ దాతలమని
రొక్కమున కాసపడి యిట్టిదిక్కుమాలి
కార్యమొనరించు వారలు గలరె ప్రభువ.

చ. కుటిలులు,క్రూరకర్ములును,కోవిదులంచుఁ జనంబులెంచగా
పటుతరపాపపుంజములఁబారఁగఁ దోలుదుమంచుబల్కు వా
రిటువలె పెక్కురొక్కమున హీనముగా గడియింపనింక నే
దిటవరిలేడె దేవు నుపదేశముల ప్రకటింప నిత్తరిన్.

ఉ. వేనకు వేలువిత్తమును పెక్కువిధంబులఁదా గడించి, స
న్మానము బొందు తావులను మానవు లన్నిలుపంగనేర్తురే?
గానగ దైవమే జగతిఁగన్పడకున్న నొకప్పు వీరికిన్
దీనజనావనుండయిన దేవుడు వీరల రిత్తబుచ్చునే.

సీ. వేదగ్రంథంబును వెన్కకుఁబడద్రోసి
సత్యవాక్యంబులఁ జాటుచేసి
తర్కమీమాంసలు తథ్యంబులని బల్కి
యరిష్టోలు ఘనుఁడని మరియుఁ జెప్పి
యన్యభాషలలోన నారసత్యము మాటి
మాధ్యంబుఁ జనులకు మరలుకొల్పి
మేమె సర్వంబని మితిమీరి వర్తించి
యిహసౌఖ్యములకు నాసించి మించి

గీ. కర్కకూటికి నాసించి ఘనులమనుచు
సర్వజనముల శాసింపశక్తులయిన
రోమ పోపుల వక్రింపురోగములను
మాన్పఁగాజాలు మందులు మహిని లేవె?

(ఆకసమువంకఁ [illegible] పరిభువా! యేమని
బల్కుచుంటివి? 'నీవే' యనియా. తండ్రీ! పాపుఁడనగు నా
నిట్టి ఘనకార్యము సాధి[illegible] ఁడునా? (ఆశ్చర్యమభినయించి)

ఆహా! ఏమీ దివ్య తేజము! నన్నావరించి నాకు శక్త్యుత్సాహ ములఁ గూర్చుచున్నదే. ఏమీ కర్ణములయందు ధ్వని. కార్యారంభమునకుఁ గడంగుమని ప్రతిధ్వనించుచున్నదే. తండ్రీ! ప్రభువా! దయామయా! (మోకరించి)

దండకము:—పరలోకమందున్న మాతండ్రి నీనామ మెల్లప్పుడున్, శుద్ధమౌరీతి తానుండెడుంగాక, నీరాజ్యమే వచ్చునుంగాక, నాముష్మికంబందు నీచిత్తమెట్లుండునో నట్లె తానిచ్చటేనుండునుంగాక, నారోజుయాహారమే వేగనాకిమ్ము నాయందు నపరాధముల్జేసి నన్నేను క్షమియించునట్లీవు నా నేరముల్ మన్ననన్ సేయరాదే, శోధనల్ నాకుఁ గల్పింక నన్ను యాపత్తునన్గావఁగా రాద, రాజ్యంబు, శక్తియున్, మహిమయున్, నీవెగా, తండ్రీ యామెన్. (లేచి)

గీ. జ్ఞాన ముదయించె నింక నజ్ఞాన మడఁగె
తండ్రి నీదివ్యవాక్యము ల్దశదిశలను
నిలుప కంకణ మేబూని, నలుపువాడ
నేది సమ్మతమని నీవు మెరుఁగ జేతొ.

ఔతమా! మన మిక యింటికజేగి, మెల్లి విటెన్బర్గు నందె లక్ష్యరస్తులనుఁజూచు పండుగకు పెక్కుజనముల విద్వాంసుల రావించి, రోమీ యాచారములు సువార్తావిరుద్ధములని నిర్ణయింతము. ప్రభువు నాయంతరాత్మకెద్ది సత్యమని బోధించునో దాని పట్టువీడక సేయువాఁడ. (నిష్క్ర॥)



# హారిస్ లాధరు.

## ద్వితీయాంకము.



### ప్రథమ రంగము.

[ ప్రజలు విటెన్బర్గులోని మఠద్వారమున కంటింపఁబడిన కాకితమునుఁ జూచుచుందురు. ]

1 పౌరుఁడు—జనులారా! రండు! రండు! ఈమఠద్వారమున కంటింపఁబడిన సద్వాక్యములాలింపుఁడు. ఎంత పుణ్య దినము! (పౌరులు మూఁగుదురు)

గీ. ప్రభువు, నిర్మలమతిఁగల్గు భక్తవరుఁడు
తనర పశ్చాత్తాపమునను దనరకున్న
ఫలములేదని దెల్పె, నవ్వాని పోవు
తపము, సంతృప్తియని బోధ కపటిచేసె.

2 పౌ—అగునగు నదియే నిక్కువము. తానొనర్చిన పాపములకు మానవుఁడు పశ్చాత్తాప వహ్నిచే దహింపఁబడి

మారుమనస్సుబొందవలెగాని ధనముచే-చీటులఁ గొన్న
లాభమేమి.

3 పౌ—దీనిని బరికింపుము.

ఉ. కానను ధర్మశాస్త్రముప్రకారము, మానవుఁడెట్లు జేయనౌ,
దా ననుమాన మొందకను తథ్యముగా జరియింపనౌను,యి
మ్మానవరాక్షసాధములు మాటికిపాటికికొ త్తచట్టముల్
బూని విధింపనెట్టులగుఁ బూర్వపు వాసియుఁ బోవకుండునే!

4పౌ—ఆహా! అమృతమే. దినమున కొక చట్టము నిర్మించి, వాంఛావిసర్జితులవలె నటించి, రాజులు తామె, దైవము తామె, ప్రజాపీడన మొనర్చు వీరి యవసానమున కిది ప్రారంభములే. సెబాసు. బాబూ! పైనేమున్నది చదువుడు.

1పౌ—గీ. చీటులనుఁ గొన్న మోక్షంబుఁ జెందుననుట
వేడినీళ్ళనుఁ గాల్చెడి వెఱ్ఱియగును
ప్రభువు రక్షింపనగుఁ గాని, పాపి మనుజుఁ
డెటుల రక్షింపశక్తుఁ డీయిహమునందు.

గీ. ఇటుల మోసము సేయంగ నెటులదోచుఁ
జనములకు నెందు, గాన నిస్సారమతులు
ప్రార్థనల రక్షణను బొందవలయునంచు
బోపుదెల్పిన యోగ్యమహా పూజ్యుఁడగును.

5 పౌ—ఆహా! సత్యవేదవాక్యము లెన్నటికి శ్రవణ గోచరమగుచున్నవి.

3 పౌ—సోదరులారా! దీనిని తిలకింపుఁడు

సీ. సర్వయాత్మలుఁ బాప సంరక్షణముఁ బొంద
ప్రభునాజ్ఞయే మొకో బలుకుటెట్లు
చీటులఁగొను వారు శిష్యులుఁ గురువులుఁ
బాపలోకముఁ జేరు పల్కు నిజము
పోపాజ్ఞయనుకొని పుడమి నమ్మెడి వారు
ప్రభునాజ్ఞ కేమని ప్రతివచింత్రు
తనర పశ్చాత్తాపతప్తులగు క్రైస్తవుల్
చీట్లులేకునికి రక్షింపబడుదు
రరయఁ బీదలకిచ్చి నార్తులఁ బోషింపుఁ
డను వేదవాక్యంబు నరయలేరె
దేవాలయపుఁ ధనము దేవువేద మొగాని
ధనమని తెల్పుట తథ్యమగు నె
పాపక్షమపుచీట్లు పరగనమ్మెడి వారి
బోధల వినకున్న పుణ్యమతులు
గీ. గురువు లేమనిదీనికిఁ గురుతుగాను
నియతివాక్యంబు దెల్పఁగఁ నేర్చినారొ
ఘనులు విద్వాంసులందఱు కరుణమీర
వీని జర్చింపవేడెద విబుధులారా.

చ. అనదలగొర్క్ష ముంగొని,సహాయతఁజూపక, యోగ్యమైనయా
ఘనుఁడగు పీటరాఖ్యునకుఁ,గట్టుట నాలయమేమి ధర్మమా
కనుఁగొన, పోపుసత్యమునుఁగాంచి, యశంబును నెంచి,భస్మమం
దనరఁగఁ గట్టుటే సుకృతధర్మముగాదె తలంచి చూడగఁ

2 పౌ—ఎంతనిర్భీతి. ఎంతనిశ్చలత్వము. ఎంతపరోపకార పారీణత. ఋజుమార్గాను వర్తియన నీతనినే చెప్పనగు. చూడజూడ నీతఁడేదియో గొప్పదిద్దుబాటునుఁ గలిగింప నవతరించిన మహానుభావుఁడని తేలుచున్నది.

5 పౌ—సోదరులారా! ఏీనినన్నిఁటి కరపత్రముల మీఁద ముద్రించి జనులందరకుఁ బంచిపెట్టినారట. అందున ప్రజలందరు మార్టినుయెడ ననన్యసామాన్య భక్తివాత్సల్యములతో నుండి కుమత విద్వేషులగుచున్నారు. కాలముననెంతలో నెంతమార్పుసంభవించును. సంతత గాఢాంధకారభూయిష్టములై, జ్ఞానశూన్యములై, తుచ్ఛ మూఢాచారాను వర్తితములైన జనుల హృదయ పేటికలపై మార్టిన తేజఃపుంజము ప్రసరించినంత, నంతయు, పటాపంచలై నూత్నవికాసము వహించినది గదా.

4 పౌ—భ్రాతలారా! మార్టిన పోపగు పదియవలూయీకొక జాబువ్రాసినాడట. దానినిఁజదివెదవినుఁడుఁ.ప్రతియొకటి మనకు లభించినది.

విటిన్బర్గు. మే. 30_1538

తంర్డీ! నన్నుఁగూర్చి, నేను తమయొక్క యధికారమునుఁ దగ్గింపఁ బ్రయత్నించిన శఠుఁడను, మూఢుఁడను, దురితాత్ముఁడని కొందరు తమకు నివేదించినట్లు కర్ణాకర్ణికగా వింటిని. ఈవాక్యము లాలించినంతనే నాశ్రవణముల కశని పాతమైనది. కన్నులు చిమ్మచీకటులు గ్రమ్మినవి. కాని నమ్మిక

గల్గు నాయంతరాత్మ నిర్మలమై నిశ్చలత్వము వహించినది.

జూబిలి దినములలో క్షమాపణ చీట్లని కుతంత్రులు కొందరు వెఱ్ఱిమొఱ్ఱి బోధలఁజేసి, యకించితజ్ఞులగు ప్రజల నమ్మించి, యీగలవలె ప్రజాధన రక్తములఁ గ్రోలి పాపరక్షణముఁ బొందితిరని వారికి నివేదించుచున్నారు. పరుల బీదలఁ జేసి తాముచియ్యపట్టి పోతరించియున్నారు.

ఇట్టి చర్చియధికారుల నేను రహస్యముగా మందలించితిని. కొందరు తలలూపిరి. కొందరు పరిహాసించిరి. కొందరు దురాగ్రహావేశులయిరి. మీయధికారమే వారినెల్ల నిట్లాడింపుచున్నది. నేనేమిచేయుటకుం దోపక వారలుజేయు పని సత్యమాయని ప్రశ్నించితిని. మరియు కొన్ని ముఖ్యసూత్రములఁ బ్రకటించి వానినిఁ జర్చించుటకై పండితులగు నాచార్యుల రా చాటబంచితి. దీని నపరాధముగాఁ జేకొని దురాత్ములునాపై నేరారోపణఁ జేయుచున్నారు. నేనిపుడేమి చేయుదును. నాసూత్రముల నుపసంహరించుకొనలేను. కానియవి ప్రజాప్రాముఖ్యమును వహించుటచే కొందరకు నాయందు బలవద్వేష ముదయించుచున్నది. ఈరోజులలో ఘనుఁడగు సిసురో యంతటివారు సహితము మాటాడవెరచు మీసన్నిధానమునకు, మూర్ఖుడను, విద్యావిహీనుఁడ నగు నే నయిష్టముతో దీసుకొని రాబడితిని, గాన నాహృదయ సంతుష్టికొరకు ప్రతిపక్షుల కోర్కెదీర్చుటకు, నాసూత్రముల విశదపరచు నొక పుస్తకమును ప్రచురింపనుంటిని. నాసంరక్షణ మొనర్చుకొనుటకై దానిని మీచల్లని నీడక్రింద ప్రచురింపనెంచితిని.

తండ్రి యిప్పుడు నేను నీపాదాక్రాంతుడనగుచుంటిని. నన్ను ముంచినను తేల్చినను భారము నీయదే. నేను మీవాక్యముల ప్రభునానతిగా భావించెదను. నేను మరణించుటకే నిర్ణయింపబడినయెడల, మరణమునకుఁ జంకను. ఈ జగత్కర్తయుః దేవునిదే. ఆతఁడు నిన్ను రక్షించుగాక ఆమేన్.

(అందరు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము.

[ పోప్, యితర సభ్యులు నాసీనులైయుందురు. ]

పో—చూచితిరా యీగడ మెంతదనుక సాగుచున్నదో! ఆ యాచార్యదూషకుని క్షమాపణగోరునట్లును. లేకున్న చర్చియధీనమునందుంచునట్లును నేడే జర్మనీకిఁ వ్రాయుడు

1స—ఆచార్యా! యిది కానను ధర్మవిరుద్ధముగదా. ఎట్టి నేరస్థునైన యిట్టివిపరీతపుచర్యలకు లోనుగావింపవలను పడదే?

పో—(కోపముతో) అట్లులయిన నొకనిమూలమున రోమను చర్చి యాధిక్యమంతయు నడుగంటవలసినదే. అట్లి న్నటికిరిఁ గానేరదు. కాగూడదు. ఎవ్విధముననైన వాని నిచటికిరప్పించి క్షమాపణగోరునట్లొనర్పవలయు

[ప్రవేశము: సేవకుఁ డొక జాబుతో]

పో—(జాబునందుకొని) సభ్యులారా! యీలేఖ కార్డినల్ కాజె

టకనకు వ్రాయఁబడినది. దీనిని మనభటుఁడు పున కందఁజేసెను. ఇందలి విషయము లాలించిన వాఁడెట్టి దుండగీడో మనకెట్టి యపకార మొనర్పఁబూనెనో యెరుంగగలము. (చదువును)

" క్రీస్తునందు విశ్వాసముగల జనకా! నేను మరల మీవద్దకు వాౢతపూర్వకముగా నరుదెంచుచున్నాను. తండ్రీ! వికర్ జాను మీరు నాయందు సదయహృదయులై యుంటిరని తెల్పినందున నాహృదయకుహరము నావరించియున్నభయో త్పాతమంతయు విచ్ఛిన్నమై మీయం దధికానురాగ ముద యించినది.

జనకా! నేను వివేకహీనుఁడనై, కార్యాకార్యము లాలోచింపక హృదయవేగముచే కానిపనియొనర్చి రోమనా చార్యుల హృదయకంటకుఁడనైతి. అట్లొనర్చినందుకు పశ్చా త్తాపవహ్ని మానసంబును దహించుచున్నది. భవితవ్యమునం దిట్టి లోపము లుద్భవింపకుండఁ జూచుకొనువాడను. నన్నీ కార్యమునకుఁ గడంగజేసిన క్షమాపణచీట్ల విక్రయించువారి మీాపు మండలించిన నేనును యికముందు వీనిని తలపెట్టను. తండ్రీ! మీారేవియో కారణములఁజూపి నాసూత్రము లుప సంహరించుకొనమంటిరి. అందుకు నా సమాధాన మిద్ది.

గీ. ఆత్మయెల్లర కొక్కటే సవనియందు
నద్ది యెట్టులఁబోధించునటుల, నేను
జేయఁగా నిశ్చయించితి చిత్తగింపు
లోపముండునే దానికి కోపమేల.

సీ. మీకు బంపినయట్టి మేల్మి కారణముల
నా చిత్తమందున తూచినాడ
నవి సకారణమని నరయంగలేకుంటి
యందున క్షమియింప నడుగకుంటి
నధికారియాజ్ఞలు బధిరపరచు నెగాని
నాత్మను నొక్కింత నణపలేవు
నన్ను పుత్త్రునికన్న మిన్నగ నెంచుచు
నా వాక్యములు కఠునవాచ్యములని
గీ. యూఘిపరచెదు నందాక రోమునగర
పోపు స్వాతంత్త్ర్యమింక నీపుడమియందు
సాగుటలుకల్ల, నిక్కము, సత్యమిదియె
పదవిజూపించి బెదరించు పాట్లువిడుడు.

ఇట్లు
మీపదారవిందభక్తియుతుఁడైన ప్రియాలుఁడు
మార్టిన్ లూథరు.”

(కోపముతో) ఆహా! యెంతటి నయవిహీనత. ఎంతటి యాచార్యధిక్కృతి. ఇందు మీయభిప్రాయమేమి.

1 స—పమున్నది. వానిని తక్షణము బంధించి రోమునకు పంపుఁడని యాజ్ఞాపించుటయే.

పో—మీకెన్నియైన వాక్కృవ్వఁడు. వాఁడు ప్రచురించినవి యకారణములని మనము రుజువుపరచునంతదాక మన లను వాఁడు క్షమింపవేడఁడు. అట్లుచేయుట మనకు

దుస్సాధ్యముగాన సైనికాధికారుల కైన నొప్పజెప్పు నుపాయమాలోచింపుఁడు. (నిష్క్రమిం॥)

(తెరవ్రాలును.)

---

## తృతీయ రంగము.

[ జర్మనీనగరము: సభికులు, మార్టిను యుపవిష్టులైయుందురు. ]

మా—మతాచార్యులారా! సోదరులారా! అస్మద్దేశీయు లారా! నేను చెప్పఁబోవుదానిని మీరు కడుంగడు శ్రద్ధాళులై యాకర్ణింపవలెనని ప్రార్థించుచున్నాను. కాన దయయుంచి యవధరింపుఁడు. మన జర్మనీ దేశము రోము పోపుయొక్క పారతంత్ర్యమున మునింగి యుండుట మీకెల్లరకు విశదమే. దేవుని సత్యవాక్యము మన దేశమునందు వ్యాపకమొందకపోవుటచే వేద గ్రంథమును దేశభాషలోనికి భాషాంతరీకరణమొనర్చి యుంటిని. తదనంతరము క్రైస్తవ స్వతంత్రమను గ్రంథమును రచించితిని. ఇద్దానిలో ప్రపథమమున యస్మద్దేశీయులకొక ప్రబోధమొనర్చియుంటిని. ఈ పొత్తము నిప్పుడు నాస్వాధ్యాయున కంకితమొనర్ప నిశ్చయించి యీరోజున మిమ్మెల్ల నాహ్వానించితిని. ఇందలి పీఠికఁ జదువ నుద్యమించుచున్నాను. అదియే ప్రబోధము.

స్నేహితులారా! యూరకుండుకాలము నశించినది. మాటాడవలసిన కాలమరుదెంచినది. నేనుమదీయయుద్దేశ్యాను సారముగా, జర్మనీలో క్రైస్తవాభివృద్ధికిని, చర్చి యభివృద్ధి కిని, బాధ్యతను వహింపవలసిన క్లర్జి తమ కేమియు బట్టనట్లూర కుండుటచే కొన్ని ముఖ్యాంశముల ప్రకటింపవలసివచ్చినది. నన్నెవరెన్ని గతుల నిందించినను, నామనోనిశ్చయమును నెర వేర్చుచున్నాను. ప్రపంచమున నెట్టి ధర్మకార్యమునైన నెర వేర్చు సమయమరుదెంచినప్పుడు, సన్యాసియే దానిని నెర వేర్పవలెనను ప్రవచనానుసారముగ ప్రవర్తించుచున్నాను. నేను జ్ఞానహీనుడనై నను వేదవాక్యమును సంరక్షించుట నావిధి యగుట నెవ్విధినైన నట్లాచరించుచున్నాను.

ఇక ప్రస్తుతాంశమవధరింపుడు. రోమీయులు వారి రాజ్య కనకరక్షణమునకై మూడు కుడ్యములు వారి చుట్టు నిర్మించుకొనిరి. అవియేవన, వారు సివిలుచర్యలకు లోనుగాక సివిలుగవర్నమెంటునకు తమపై నెట్టియధికారము లేదని వచింతురు. రెండవది వేదవాక్యానుసారము తమ్మెవ రైన శిక్షించిన, వేదవాక్యము పోపుయధీనమేగాని, యితరు లకు దాని నుచ్చరించుటకు గాని చూచుటకుగాని యర్హత లేదందురు. మూడవది ప్రజా సంఘాభిప్రాయానుసారము తమ్మెవరైన శిక్షించిన ప్రజాసంఘము ప్రోగుచేయుట పోపు యధీనమేగాని యితరులకట్టి హక్కు లేదందురు. ఇక వీనినుండి తప్పించుకొనుట యెట్లో విమర్శింపవలయు.

క్రైస్తవులలో పదవులలో బేధమేగాని యాత్మజ్ఞాన

మున్న నందరొక్కటే. బాప్తిజమెప్పుడు పొందిరో నందరప్పుడే గురువులైరి. కాన వారికి మనకు భేదమిసుమంతయినలేదు.

గీ. మాతమునకుఁ జెందు గురువుల మనుజులెల్లఁ
బాపమున్నను శిక్షింప వలదటంట
కన్నబాధల పడుచుండ కరము సబ్ధ
తను వహించుట గాదెయో తగునెచెపుడి.

గీ. పదవు లెట్టివిగల్గిన, పాప, మనుభ
వింపకఁ దరమె శిక్షను, వెర్రులారా సర్వసామా
న్యుఁడగు వాడు సజ్జనావ
నుండునయి యున్న సన్నుతి నొందదగడె.

దీని వారిప్రథమకుడ్యము భగ్నమునొందినది. తాము గురువులైనంత పాపమొనర్పఁదక్షులా! అట్లెన్నటికిని గానేరదు. అగ్ని, రాజసౌధమును, పర్ణశాల నేకరీతి దహించునట్లు పాపమెచ్చటనున్న శిక్షింపఁబడ వలసినదే. ఇక రెండవ విషయము.

గీ. వేదగ్రంథంబు జదువంగ వేనవేలు
క్రైస్తవులు నాశతోడుత కేలుఁజాప
పోపుయొక్కఁడె చదువంగ నోపునంట
వెర్రివాక్యాను సరణిమై వెగటుదోచు.

గీ. వారలైనను వాక్యముల్వరనఁ జేసి,
యున్నకానను చట్టంబు కొన్నిమతవి
రుద్ధనాజ్ఞలతోడుత రోతదోపు
చుండునేమిార లెంచి చూడండి మదిని.

వేదగ్రంథము జదువు నధికారము పోపునకేగాని యన్యులకు లేదనుట కడుంగడు హేయ్యముగాదా! దీనినెవ్వ రైన నంగీకరింతురా? ఎప్పటికి నంగీకరింపరు. ఇక మూడవ విషయము చూతము.

ఉ. వేదవిరుద్ధమాగతిని విశ్వయశుండగు పోపుజోపుచో
వేదమె కారణంబుగ శపింపఁగ శిక్షనుఁ బొందఁజేయఁగా
పేదకునైన సాధ్య, మన పేక్షితమంచు దలంపరాదు నం
దే దలవంచనిచ్చినను, యేసుప్రభుండు మనల్ హసింపడే.

సీ. పట్టణంబొక్కటి పావకావజ్వాల
మాలికలంబడి మ్రగ్గుచుండ
రాజకీయోద్యోగిరయమునఁ జనుదెంచుఁ
దానినార్పనటంచు దలఁచుచుండి
మనకేమివిధియని మనుజులందరుఁగూడి
నూరక జూదనపారనరక
కూపంబునంబడి గుందుచుందురుగాన
పోపు వేదవిరుద్ధపాపుడైన
గీ. నతని శిక్షింప నందరకవధిగలదు
వారినెంతగ ప్రేమించు ప్రభుఁడుమదిని
నటులె మనలనుఁ బ్రేమించు నరయనిజము
కపటభక్తుల ప్రేమింపఁగలఁడె ప్రభువు.

సభాస్తారులారా! వింటిరా. ఇందలి నిజానిజంబు లరసి మీసంతుష్టినో, యసంతుష్టినో దెలిపినగాని ముందు విషయముల వెలువరింపఁబోను.

1సభ్యు—ఆర్యా! మార్టినాచార్యా! మీవాక్యములు మాక మితాహ్లాదమును గలిగించినవి. ఎండమావులఁ గని జలమని భ్రమసి భ్రమణమొనరించు పాంథునకు సుస్నిగ్ధకమనీయవారిపూరితకల్హారాక్రాంతకాసారావలోకన మెంతటి కుతూహలముఁగల్గించునో, నోట తడి యారి వినువీధి వీక్షించు చకోరమునోటఁ జలధరవారి బడిన యెటులుండునో, యటులున్నది మాకు.

2స—ఆర్యా! నీవు నిక్కపు మానవుఁడవో, లేక దేవ దూతవో, మమ్మీ రోమను పారతంత్ర్యమునుండి రక్షింపవచ్చిన యమానుషమూర్తివో నెరుఁగజాలకున్నాము.

3స—గురూత్తమా! యంధకారంబునఁబడి పరిభ్రమించువానికి తరణి కిరణజాలప్రసారమెట్టి సంపూర్ణానందముఁ గలుఁగఁజేయునో, నట్టి యనిర్వాచ్యమగు నానందము మా మనంబులఁ బెనఁగొనినది. మేమెల్లరము మీ యిచ్ఛానువర్తులమై మిమ్మనుగమించెదము. సత్వరము మేమాచరింపఁదగు విధ్యుక్తధర్మము సెలవిండు.

4స—

ఉ. స్వాగతమో మహాత్మ!మనసారనొసంగెదుస్వాగతంబు,మీ
యాగమనంబుమాహృదయమందునసంతసముద్భవింపఁగాఁ
జేగలిగెఁ యికోరఁత, చేకురె దేవుని సత్యవాక్యముల్
బాగుగమమ్ము మీదరినిఁబాయకయుండుసుఖంబుఁగూర్పవే.

గీ. చిల్లగింజల పొడితోడఁ జేరుకతన
కల్మషజలంబు స్వచ్ఛతగాంచునల్లు
మిమ్ముఁబోలినవారితో మైత్రిసేయ
మందుఁడైనను కడుబుద్ధిమంతుఁడగును.

గురూత్తమా! మాకిక నీవే శరణ్యము. రోమునగర స్వాతంత్ర్యమునుండి జర్మనుపారతంత్ర్యము నుద్ధరింప దీక్షా బద్ధకంకణుఁడవుఁగమ్ము. లెమ్ము. ముందేది కర్జమో నాన తిమ్ము. రోము పోపుల తలదిమ్ము, నీ తేజఃపుంజమునఁబోజిమ్ము అంధకారవ్యాప్తమగు మా మానసమ్ము త్వదీయజ్ఞాన సూర్యోదయానంతరమ్ము విశుద్ధమ్ము గానిమ్ము.

5 వ—

సీ. నేఁడెఁగా మాకు మీనేర్పుదీపింపఁగ
స్వాతంత్ర్యముంజూపు చలువదినము
నేఁడెఁగా యేసుని నిర్మలాంభఃపూర
కాసారమగ్నంబుఁగాంచుదినము
నేఁడెఁగా పోపుల వేడబంబులనెల్ల
నిలుపంగనేర్చిన నిత్యదినము
నేఁడెఁగా దుఃఖార్తి నింగి నాలోకించు
జనములు సంతుష్టిగనెడుదినము
గీ. భవ్యభవదీయగుణశోభాయమగస మ
జలధరంబు లవారియై సంతసంబుఁ

గూర్చి, నందరు మిమ్ములఁ గూడుకొనుచు
నేది కర్తవ్యమో దెలుప నెరుఁగువారు.

మా—సోదరులారా! ఇప్పటికి చాలా కాలాతీతమైనది. ఫల హారానంతరము మనమెల్లరము సమావేశమై కర్తవ్యాంశము విమర్శింతము. (నిష్క్ర॥)

(తెర వ్రాలును.)





# మార్టిన్ లూధరు.

## తృతీయాంకము.

### ప్రథమ రంగము.

[ ప్రవేశము: మార్టిన్, సభ్యులు, జనులు, జయజయధ్వానములతో ]

మా—సభాస్తారులారా! యిప్పుడు నేచెప్పఁబోవు నంశములు శ్రద్ధాళులై యాకర్ణింపుఁడు.

దేవుని భక్తులమని, యాముష్మికావాంఛాపరులమని లోకమెల్లఁజాటు పోపులఖండభూమండలముఁ బరిపాలించు చక్రవర్తులపోల్కి, యిహసౌఖ్యముల నాశించి, యాడంబరములఁగోరుట కడుంగడు హాస్యాస్పదము. పవిత్రులగు వారిట్టి కార్యాచరణ మొనరించుట హేయముగాన వారు వానిని విసర్జించి సామాన్యులవలె నుండవలయునన్నది విధమాంశము.

రెండవది క్రైస్తవరాజ్యములో కార్డినల్సువారివలన లాభమేమి. ఇటలీ, జర్మనీలోని ఫలక్షేత్రము లనుభవించుటకేఁగదా వీరిని నిర్ణయించినది. వీరిని తగ్గింపవలయును. లేదా పోపు వారిని తన స్వంతధనముమీఁద పోషింపవలెను. వారివలన నెట్టిలాభములైన యున్నఁదెల్పుడు.

1 స—లేదు. లేదు. ఇసుమంతయు లేదు. మీరు వచించునవి యన్నియు యదార్థములు, సత్యములు, నిష్పక్షపాతములు.

మా—పాపలుకోర్టు నూరవవంతువరకు తగ్గింపవలయును. మనము ప్రతివత్సరము, రాజుకంటె పోపునకే హెచ్చుధనముఁ జెల్లించుచున్నాము. తుర్కీ-యుద్ధమను మిషచే ధనము పోగుచేయుట మానవలెను. పోపే యుద్యోగీయులందరి నేర్పరచునధికారము పోవలెను. త్వరలో లంచముఁగొని నింకొకని నియోగించుటకై వృద్ధుల కుద్యోగములిచ్చుట మానవలెను. పాపపరిహారపుఁ జీట్లమ్ముట నాపవలెను. రోమునగరమందొకనికి 22 యుద్యోగములున్నవి. ఇట్టివన్నియు మానవలెను. ఇదియదియననేల రోమునగరమున ధనసంపాదనకై జరుపఁబడు చౌర్యప్రక్రియలన్నియు నాగిపోవలెను. నేనతిశయిల్లి పలుకుచుంటినని తలంపకుఁడు. ఇవి యన్నియు యదార్థములగునో కాదో మీరే తెల్పుఁడు

2 స—నిజము, నిజము, వారు మనల నన్నివిధముల దారిద్ర్యదేవత కప్పఁజెప్పుచున్నారు. కన్నులు లేనివారమై,

మూఢులమై, వారే దైవమనినమ్మి సర్వస్వాతంత్ర్య ములఁ, సర్వసుఖములఁ గోలుపోతిమి. ఇక వారలనమ్మఁ బోము. మమ్మేటులనడిపించిన మీదేభారము. నీట ముంచినను సరే. పాలముంచినను సరే.

మా.—సోదరులారా! మీ కిప్పటికైన జ్ఞానోదయమైనందుకు సంతసించుచున్నాను. పై కార్యములెట్లగునని తలంప నలయు. నేముందు చెప్పఁబోవుపలుకు లాలించిన సర్వము కరతలామలకమగును.

1. విదేశీయులుచర్చి జీవమున కొప్పుకొనఁగూడదు.
2. ఎక్లెసియాస్టిక్ లెవరును రోమునగరమునకుఁ గౌరవము పొందుటకుఁ బోగూడదు. ఇటులనొక చట్టమేర్పరుపవ లెను. రోమున కెవరు ఘనవులుచేసుకొందురో వార్యుతమ పదవులఁగోలుపోదురు.
3. ఎట్టితగవులయిన నాపట్టణములోనే తీర్పుగావింపఁబడవ లెనుగాని, రోమునకుఁగాని, పోపువద్దకుఁగాని,గొనిపోబడఁ గూడదు.
4. పోపు చాలాయాఫీసులను తీసివైచి, తక్కినవానిని తాను స్వయముగా పోషించుకొనవలెను.
5. బిషప్పులను సివిలుమేజస్ట్రేటులే నియమింపవలెఁగాని వారుపోపునకు లోబడియుండరాదు.
6. పోపునకుఁ జక్రవర్తిమీద నెట్టి యధికార ముండఁగూడదు. బిషప్ రాజు నభిషేకించురీతి పోపు చక్రవర్తి నభిషేకింప వలెను.

7. పోపు పాదములు ముద్దిడుటాదిగాఁగల యోహ్యపు మర్యాదలు నిషేధింపఁబడవలెను.
8. జూబిలీ దినములలో రోమునగరమున కెట్టి యాత్రలును సలుపరాదు. తమపాష్టరు వారి యాజ్ఞలేని దెన్వరెట్టి యాత్రలకును వెడలరాదు.
9. యాత్రికుల యాచించుట నాపవలెను. ప్రీష్టుకు వివాహము వారియిష్టానుసారమే నుండవలెఁగాని, తప్పనివిధిగా నుండరాదు.
10. కానను శాస్త్రములోని యధర్మసూత్రముల తగ్గింపవలెను.
11. ఒక్కయాదివారముదక్క తక్కిన శెలవుదినములేవియు నుండరాదు. అట్టిదినము లిదివరలో త్రాగుడుకుమాత్రమే వినియోగింపఁబడు చున్నవి.
12. దూరపువివాహములు నిషేధించుట పోపుద్రవ్యము సేకరించుటకే గాన నట్టినిషేధముండరాదు.
13. ఉంఛవృత్తి క్రైస్తవరాజ్యమునందు నిషేధింపఁబడవలెను. యాత్రికులకు ధర్మమొనర్చుటకంటె ప్రతిపట్టణవాసులు తమబీదలఁ బోషించుట యుత్తమము.
14. కళాశాలలలో ననవసరవిషయములఁబోధించుచున్నారు వానిని నేర్చినవానికంటె నొకకుమ్మరి యుత్తముఁడని చెప్పఁదగును. అరిష్టోలాత్మనుఁగూర్చి వ్రాసిన నుత్తమకావ్యమున "శరీరముతో నాత్మనశించునని" వ్రాసినాఁడు. ఇట్టివిద్యలేనా మనవారభ్యసింపఁదగినవి.

15. వేదపాఠశాలలలో వేదగ్రంథమునకే నధిక ప్రాముఖ్యత నొసంగవలయు.

16. ప్రతిపట్టణములోను లాటినులోగాని జర్మనుభాషలోగాని బాలబాలికలకు వేదగ్రంథము నేర్పు పాఠశాలలుండ వలెను.

17. పోపు జర్మనుచక్రవర్తిపై నధికారముఁగలిఁగి యున్నాడని యెవరును యెప్పుడును బోధింపఁగూడదు.

18. ఇకముందు వ్యవసాయమును వృద్ధిపరచి వాణిజ్యమును తగ్గించి ప్రజలసౌకర్యము వడ్డీలక్రింద ననవసరముగా వ్రయ పరుపఁబడుట నాపవలెను.

సభాస్తారులారా! మీరెన్నఁడు వినని క్రొత్తవాక్య జాలంబుల నేఁడువినుటచే కొందరి యంతరాత్మకు కష్టము, నయిష్టత గలిగించిన వాఁడనయితినేమోయని చింతించు చున్నాను. కాన నాయందలి దోసఁగులుమన్నించి సత్యా సత్యముల విమర్శింప వేడుచున్నాను.

(సభ్యులు జయజయధ్వానములతో కరతాళముల నొనర్తురు)

3 స—ఆచార్యా! నేటితో జర్మనుపారతంత్ర్యముడుగంటినది. ఇకమేము నిర్విచారముగా మిమ్ము మార్గదర్శకులుగాఁ గొని మీయాదేశానుసారము ప్రవర్తించువారము. ప్రభుపేరిట మేమిప్పుడే దీక్షాబద్ధ కంకణులమగు చుంటిమి.

మా—(స్వగతము) ఆహా! ప్రభుసేవ యెంతలో నూరంత లైనది. నాకేవియైన కష్టములు సంభవించినను నాబో

టిసత్యవీరులు వేనకువేలున్నారనుట కీసభయేనిదర్శ
నము. ఇక నిశ్చింతతో కార్యారంభుఁడ నయ్యెద.
(ప్రకాశముగా) సోదరులారా నేటికి సభచాలింతము.

(నిష్క్రమింతురు,) తెరపడును.

---

## ద్వితీయ రంగము.

[ పోపు, కాజిటన్, ఆకోలిటి, మరికొందరుందురు. ]

పో.—సభ్యులారా! లూధరుదుండగంబు లంతకంత కెట్లు మితి
మీఱుచున్నవో చూచితిరిగదా! మీరిపుడు లూధరు
సూత్రములన్నియు మతవిరుద్ధములనియు, శ్రవణపుట
విదారుణములనియు నొకశాసనము నిర్మించి వాని
నద్దానికి బద్ధునిఁగాఁ జేయవలెను.

[ ఈక్ ఆతురతతో ప్రవేశించును. ]

ఈ.—ఆచార్యవర్యా! సభాస్తారులారా! నేను మనరాజ్యంబు
నఁగల యెల్ల కళాశాలలకరిగి, గ్రంథాలయముల
నెమకి, గ్రంథముల శోధించి, మన మొనర్చునది సహే
తుకమనియు, లూధరు సూత్రము లప్రమాణము
లనియు, నిర్దేశింపఁజాలు విషయసంగ్రహణ మొనర్చి
తిని. మీరు నాకుశెలవిచ్చినచో నొక్కత్రుటిలో లూధ
రుని విఫలమనోరథునిఁగాఁ జేయఁజాలుదు. ఆపయి
మీయిష్టము. (కూర్చుండును.)

పో—సభికులారా! మీకిపుడు సహాయసంపత్తికూడ లభించినది. మీరాతని సహాయమున నొకశాసనము నిర్మింపుడు. అద్దానిని నేనంగీకరించినటుల సంతకమొనర్చువాఁడ.

(సభ్యులు లోనికరిగి యొకశాసనముతో ప్రవేశింతురు.)

ఈ—శాసను ధర్మశాస్త్రప్రకారమొక మతద్రోహిపై నిందారోపణఁ జేయుటకుఁ బూర్వము వానికి వర్తమానమంపవలసియున్నది. కాన యటుచేయుట మంచిది.

అకో—అందులకు సందేహింపనేల. నేడే యటులఁజేయుదము. ఈశాసనము జర్మనునగరములో ప్రకటింపబడిన మాసద్వయములో లూధరు క్షమాపణఁ గోరవలయు. అతఁడటులఁ గావింపకున్నచో మతద్రోహిగా, దుండుడుకుగా నెంచఁబడి యట్టివారికిఁ దగు శిక్షనొందును.

కాజి—సరే, యన్నియుఁ బాగుగనేయున్నవి. కాని ప్రప్రధమమున దీనిని జర్మనునగరమున ప్రచురించునదెవరు?

ఈ—(రోషముతో) ఎవరోయననేల? నేనే యీకార్యమునకుఁ గడఁగెద. ఇట్టి క్లిష్టసమయమున ధైర్యమవలంభింపకున్న చేటు వాటిల్లదా?

"ఉ. చెక్కిలినొక్కుచుఁ జనులుచేపఁగముద్దిడికొంచుఁ జేర్మిమై
నక్కునఁ జేర్చికొన్న సమయంబున బాలుఁడు పాలుగ్రోలుచుఁ
ముక్కుకటుక్కునన్గొరక ముద్దదియెల్లను మూలఁబట్ట "నా
యక్కయి దేమిగోరిచెడుగా" యనదోసమే దానరోషమే.

ఉ. గుట్టిది బైటబెట్టుటకుఁ గొందరెరింగియు సంశయింతురీ
చెట్టనడంపకున్న నెటుఁ జేటుదొలంగు మహాకవిత్వ వి
ద్గటసుధాసధామకవితానవతామరసావనావచ్య
పట్టణవైభవ ప్రథితబంధురసౌధవిలాసలక్ష్మికిన్"

అనురీతి యీమహాపరాధకుని దుడుకులడంపకున్న నింటిదీపమని ముద్దిడ మీసలుఁగాలిన చందమగు. గాన నిప్పుడే పయనమై జర్మనునగరమున కేగెద. [నిష్క్రమి॥]

తెరపడును.

---

## తృతీయ రంగము.

[ ప్రవేశము: అలగ్జాండరు, ఈక్ జనసమూహము. ]

జనులారా! పోపునందు విశ్వాసులారా! నేనిప్పుడిట కరుదెంచుటకుఁ గారణమేమన. లూథరు ప్రచురించిన సూత్రములు రిత్తలనియు, నసత్యములనియు ధృవపరుపఁబడి పోపువల్ల నొక శాసనము నిర్మింపఁబడినది. అద్దానిని ప్రచురపఱచుట కరుదెంచితిని.

గీ. లూథరుని వాక్యముల్విసిలోలులగుచు
పోపునాత్మకుఁ గష్టంబుఁదోపఁజేయు
వారలెల్లరు శిక్షింపఁబడుదురంచు
దెలుపనే తెంచితిని నిజముఁ దెలుసుకొనుఁడు.

"గతానుగతికోలోకో" యను ధర్మము ననుసరించి పూర్వాచారములనృష్టించుట శ్రేయము.

సీ. మన తాతలెల్లరు మనవలెఁగాకను
పోపును సేవించి పుణ్యులయిరి
మన తండ్రులెల్లరు మనవలెఁగాకను
పోపును సేవించి పుణ్యులయిరి
మన పెద్దలందరు మనవలెఁగాకను
పోపును సేవించి పుణ్యులయిరి
మనలోనఁగొందరు మనవలెఁగాకను
పోపును సేవించి పుణ్యులయిరి
గీ. పాపజ్వరార్తునకుఁజూడ పోపు పాద
సేవనముతప్ప మరియొండు త్రోవలేదు
సాధువాక్యంబు లాలించి సాధులగుట
కన్న వేరొండు పాపంబుయున్నదొక్కొ.
గీ. తరతరంబులనుండియు వరలుచున్న
ఘనతరాచారమదుగంటఁ గాంచుకన్న
వేరుపాపంబుగల్గునే, వెఱ్ఱిలగుచు
పరుల బోధలనాలింప ఫలమునున్న.
చ. కనుడిది పోపునానతి సృగాలరవంబులమాన్ప నెంచి సు
మ్మనఘులఁబ్రోవ నెంచి విమలాత్మునుఁగూర్చినబిల్లు దీనికే
మనియెదురాడులూథరు, సహాయసికన్నులుమూయకుండునే
మన గలవారలెవ్వరిలమాటలు వేసుగబల్కి పోపుతోఁ

కాన మీరెల్లరు పోపునానతి ననుసరించి పూర్వాచారముల విసర్జింపక ప్రవర్తించెదరని నాయుద్దేశ్యము. ఇవినా వాక్యములు గావు. పోపు వాక్యములుగా తలంపవలయు.

ఇదిగో మీయందరి సమక్షమున లూధరు సూత్రములను, యతనిచే రచింపబడిన పుస్తకములను పావకున కాహుతి యొసఁగుచున్నాను. (తగుల పెట్టును.)

(తెరపడును.)

---

## తురీయరంగము

(ప్రవేశము విద్యార్థులు మార్టిన్)

మా.—జనులారా! విద్యాశీలులారా! న్యాయాన్యాయవిచక్షణదక్షులారా! ప్రభుపాదారవింద, మకరందమాధుర్య రసాస్వాదమత్త భృంగములారా! నేడొకచిత్రమిటఁ జరుగఁ బోవుచున్నది. ఎవ్వరు ప్రభువాక్యములఁ దెలుపు వేదగ్రంథాను వర్తులుగాతలంతురో, వారెల్లరునేడు పట్టణబహిర్భాగమున నున్నపుణ్యతమ మగు క్రాసు చర్చి వద్దకుఁజనుదెండు.

గీ. అచట పాపక్షమపుఁ జీట్లు హావ్యవాహ
కర్పణముఁ జేయనెంచితిమయ్య మేము
మాదువైరులు మాదగుమార్గములను
దగ్ధమొనరింపఁగాలేద తలఁచిచూడ.

నేత్రానందకరమగు దృశ్యము. భక్తజనహృదయ సమ్మోదజనకము. సర్వస్వతంత్రప్రియకరము రండు రండు శ్వరపడుడు.

[ జనసమూహము గుంపులుగుంపులుగా ప్రవేశించును. ]

1 విద్యార్థి—మిత్రులారా! యేల నాలసించెదరు. ఇట్టిసంతస సమయము మరొండబ్బదు. రండు, రండు, చితిం జేర్పుడు.

[ అందరు చితి సేర్పరుతురు. ]

2 వి—ఇప్పుడు చితికగ్నిఁదగుల్చు పుణ్యకార్య మెవరుచేతురు

మెలాంక్థన్—అదియేమట్లనెదరు. కష్టమొకరిది ఫలమొక రిదియగునా. నేనే చితికగ్నితగుల్చువాఁడ. (అట్లు చేయును.)

మా—(కానను ధర్మశాస్త్రమును పట్టుకొని)

ఉ. దేవుని వేదవాక్కులకుఁ దీరనిద్రోహముఁగూర్చియుంటినా
పోపు దురాత్ముఁడై సకలభూజనులెల్లరుఁ జూచుచుండఁగా
దాపురమారెు యీచితియు తథ్యముసత్యముఁదప్పువారికే
యాపదలిట్టు చేకురునవాచ్యమ కానను ధర్మశాస్త్రమా.

1 వి—(బిల్లును చేతనుంచుకొని) ఈకుతంత్రముచే నిర్మింపఁ బడిన మోశాసనమా.

ఉ. సత్యము పహాటిదోషముల, సత్యములంచని సాటనెంచునా
నిత్యయుధీరుచే మెలఁగనిట్టి గతింజొరగంటి వింక, నా
న్నత్యముఁబొందఁగోరు సుజనావళినిన్ను నుతింపఁబోరు సా
పత్యము బొంది వానికిని, వహ్నిజొరంబడె దీవునిప్పుడే.

(అగ్నియందుంచును) (విద్యార్థులు లూథరునకుఁ జయ జయధ్వానములొనర్తురు) (లూథరు నిష్క్రమించును.)

మెలాంక్తన్—సోదరవిద్యార్థులారా! ఇఁక చితిగీతములఁబాడుదము రండు. (అందరు చితిచుట్టుఁగూడుదురు.)

ద్విపద. అరయ నీచుల హస్తమందుననుండి
దురితంబునొందియు దుఃఖంబుఁగూర్చి
నేఁడు యీపావకు నేర్పునఁజేరి
తోడయి శాంతినిదూలితి వాక్కు.

గీ. పావకుఁడ వీనిభక్షించి పాపఫలముఁ
జగతి లేకుండఁజేయవే, వగచుచున్న
సత్యమార్గంబు నీదగు జ్వాలలట్లు
భువిని వికసింపఁజేయవే పుణ్యమగును.

[ అందరు జయజయధ్వానములతో నిష్క్రమింతురు. ]

[ తెర పడును. ]





# మార్టిన్ లూథరు.

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము.

[ ప్రవేశము: లూథరు, నతని హితులు. ]

మా—స్నేహితులారా! మన దిద్దుబాటు జర్మనీనగరమందంతటను వ్యాపించి ప్రాముఖ్యతను వహించినది. అందులకు ప్రభుపాదారవిందములకు కృతానేకనమస్కారములు. ఇప్పుడు మన జర్మనీదేశమునకు ౫వ ఛార్లెను చక్రవర్తి యయినాడు. వరమ్సునగరమందొక రాజ్యపుసంఘమును గూర్చి నన్నటకు రా వర్తమానమంపియుండె. ఇందున మీయభిప్రాయమేమి?

స్పాలటిన్—మిత్రమా! నీవొక్కడచ్చోటికరుగుటకు మామనంబు లొప్పకున్నవి. భవిష్యద్దశ విపత్పరంపరలతో నిండియున్నది.

మా—ఏటికా వెఱ్ఱి మీకు? చక్రవర్తి వర్తమానమంపినంత సందేహింపవగునా? బాబిలన్ రాజ్యమునందు హీబ్రూ బాలుర రక్షించిన యతఁడు నన్ను రక్షింపఁజాలఁడా? వారు నన్నుఁ జంపఁదలఁచియేయున్న సకల మానవ రక్షణార్థము సిలువమీఁద తన పవిత్రరక్తమునుఁజిమ్మి యసువులఁబాసిన ప్రభుకంటె నే ఘనుఁడనా. ఇచ్చట నాపదల నాలోచించుట కిసుమంతయిన నవకాశము లేదు. రక్తము చిందించియైనను, మనము ప్రారంభించిన సువార్త వ్యాపకము సంపూర్ణముఁ గావింపవలయును. ప్రాణముల కాశింపక నట్లొనర్చుటయే మన ముఖ్యధర్మము.

స్పా—నీవు గతించిన కార్యము నెరవేపుట దుర్లభము. ఇప్పట్టున జనులైనను, సత్యాసత్యముల నెఱుంగఁజాలక డోలాయమానచిత్తులయియుండిరి.

గీ. కర్ణధారుఁడు గతియింపఁ గడలిఁజేరు
నావగతియౌను మమ్మేల గావకున్న
సత్యమిదియని జనులకుఁ జక్కఁజెప్పు
పిదప నెట్టులనైనను భీతిలేదు.

మాతృవిహీనశిశువుంజేసి నీవేగుట న్యాయముఁగాదని నా మతము. ఏలనో నామనమునుమిషము కీడునే శంకించుచున్నది.

మా—ఓ వెఱ్ఱులారా! ఏల మీకాభీతి.

ఉ. సంతతమెవ్వఁడీజగతి సాకి లయంబొనరించు వాడు నా
చింతలఁబాపి సత్యమునుఁజిమ్మెడి నద్దెసలందు, నింక నా
వంతయుఁ భీతిగల్గునె నపాయము శంకిలనేల మీరు, యే
సుంతయుఁ గాలముల్ వృథగఁజూపక సత్యముచాటుచుండరే.
నా మనోనిశ్చయ మిదే యెరుంగుఁడు.
ఉ. భీకరశత్రుసంతతు లభేద్యముగా తెరవందు డాగినన్
ప్రాకటమౌ దవానలము పట్టణమధ్యల జ్వాలలంపినన్
వీకదలిర్ప నేనరిగి ప్రీతిగ దేవుని వాక్యజాలముల్ .
వాకొని వారిసూత్రము లపాత్రములంచని దెల్పకుండునే.
మిత్రులారా! ఏటికి నాకిట్లు పిరికిమందు బోసెదరు.
వరం నగరమందలి గృహములపై పెంకులన్నియు నన్ని దయ్య
ములై ప్రవర్తిల్లినను నేనచటికరిగియే తీరుదు.
స్నా—మిత్రమా నీవట్లుబలుక మేమింకేమనఁగలము. ప్రభు
సహాయము నీకెల్లప్పుడు గలుఁగుచుండుగాత.
(నిష్క్రమింతురు— తెర వ్రాలును.)

---

ద్వితీయ రంగము.

(మార్టిన్ ప్రార్థనఁజేయుచు ప్రవేశము.)

గీ. దేవదేవ దయాసింధు దీనబంధు
నీదువాక్యంబులే మది నిక్కమనుచు
సభను గాలిడుచుంటిని జంకులేక
నెట్టుల రక్షించెదో నన్ను యేసుదేవ.

(చక్రవర్తి మరియితర రాజులతోను పండితులతోను పరివేష్టితమైన సభలో లూధరు ప్రవేశించును.)

అధికారి—లూధర్! యిచట నిన్నడుగు ప్రశ్నలకే జబాబీయ వలెఁగాని యనవసరప్రసంగముఁ జేయఁగూడదు.

మా—ప్రశ్నకీయవలసిన జబాబే విరళమైన నప్పుడేమిచేయుదును.

అధి—ఓహో, యప్పుడే కుళ్ళంకలు వేయుచుంటివే.

ఈక్—ఓయియపరాధి!

మా—ఏలనన్నటు సంబోధించెదరు. ఇంకను నపరాధనిర్ధారణ మొనర్పలేదుగదా!

ఈక్—ఓహో, అటులనా; సరి, లూధర్! యీబల్లపై నున్న గ్రంధములన్నియు నీవు రచియించినవేనా? గ్రంధస్తములగు విషయములన్నియు నొప్పుకొందువా? కొన్నిటి నుపసంహరించుకొందువా?

స్పర్ఫ—ఇప్పట్టున లూధరున కాగ్రంధనామము లేవియో వినుపించిన నుత్తమమని నాయభిప్రాయము.

(ఈక్ చదివి వినిపించును.)

మా—ఆర్యులారా! మీరడిగిన ప్రశ్నలు రెండు. ప్రథమ ప్రశ్న గ్రంధముల నావియేనాయని. అవి నావియనుట నిర్వివాదాంశము. అందంతయు నొప్పుకొందునా లేక కొంత నుపసంహరించుకొందునా యనుప్రశ్న కుత్తర మొకమాటలోరాదు. అదిమనమెల్లరము కేలోన్నదృ్వఁ దగుప్రభు విషయమైయున్నదిగాన విచారణీయము.

ఉన్నదానికన్న యెక్కువచెప్పినను తక్కువచెప్పినను ప్రభుశిక్షకు ప్రాత్రుఁడగావలసి వచ్చును. "నన్ను ప్రజల సమక్షమున నెఱుఁగనను వానిని, నేను పరలోకమందున్న తండ్రియొద్ద నొప్పుకొన"నని ప్రభువు చెప్పెను. గాన, నేచక్రవర్తిగారిని, నాయాత్మకు విరుద్ధముగాను దేవునికి విరుద్ధముగాను, మాట్లాడకుండుటకై నాలోచన కొఱకు కొంతవ్యవధినిఁ గోరుచున్నాను.

(ఈక్ చక్రవర్తితోను, యితరులతోను రహస్యాలోచనచేయును)

ఈక్——మార్టిన్! నీవపరాధివిగా నిటకు రావింపఁబడితివను విషయము నీవెఱిగినదే. గాననీకెక్కువవ్యవధియిచ్చుట నసంభవము. అయినను చక్రవర్తిగారు కరుణార్ద్ర హృదయులుగాన, నీకొకరోజు గడువిచ్చిరి. నీవు రేపీ సమయమున కిచ్చట వ్రాతరూపముగా గాక వాగ్రూపముగా ప్రత్యుత్తరమిచ్చుటకు సంసిద్ధుఁడవయి రావలయును.

మా——(తనలో) ఆహా! వీరందరుఁ జేరి నన్నెట్టి కపటతంత్రమున బిగించిరి. వీరేవియైనఁ గొన్ని విషయము లెత్తి వీని నెట్లు సిద్ధపరచెదవని ప్రశ్నింతురని దలంచితిగాని విషయమే లేనప్పుడుపసంహరించుకొనుటగాని సిద్ధాంతీకరించుటగాని యెట్లు? ప్రభువే నన్నీవ్యవధిఁగోరునట్లు చేసెను. ఇట్టి విషమసంధియందాతఁడే సాయము.

(అందరు నిష్క్రమింతురు——తెరవ్రాలును)

## తృతీయరంగము.

(సభ మరల సమావేశమగును.)

స్పాలటిన్—మార్టిన్! నీవు చక్రవర్తిగారిగడువు నొసంగుటచే ధన్యుఁడవైతివి. నీవేల బిలువనంపఁబడితివో యెరిఁగియేయుందువు. భగవద్భక్తులగువారు నిశ్చితాభిప్రాయమునే వెల్లడింతురుగాని, కాదనియనరు గాన యిప్పుడేమని ప్రత్యుత్తరమిత్తువో వేగ తెల్పుము.

మా—(స్వగతము) ఆహా! సంశయావస్థయందున్న నామదికీనామిత్రుఁడు స్థిరతనుఁగల్పించినాడు. ఇక నిశ్చింతతో ప్రత్యుత్తరమొసంగెదఁగాక. (ప్రకాశముగా) పూజ్యుఁడగు నోచక్రవర్తీ! యువరాజులారా! గౌరవనీయులగునో సభాస్థులారా! నిన్నమీరేర్పరచిన మేరకు, విధేయుఁడనై నేనిటకరుదెంచితిని. మిమ్ములనందర సావధానులరై, దేవుని పేరట నేఁజెప్పఁబోవు, సత్యము నాలకింపవలెనని కోరుచున్నాను. మిమ్ములసంబోధించుటలో మీగౌరవార్హములైన పదవుల కుచితమగు బిరుదముల నొసఁగజాలకుంటినేని, యెన్నడును యిట్టి యధికారుల సముఖమున కరుదెంచనట్టియు, సన్యాసనహవాసినగు నట్టియు, నాత్మపారిశుధ్యముతో దేవుని సత్యవాక్యముల బోధించునట్టియు, నాయపచారమును మన్నింప వేడుచున్నాను. ఓచక్రవర్తీ! నిన్నమీరునాకు రెండు ప్రశ్నముల నొసఁగితిరి. అందు ప్రథమ ప్రశ్నకు, నాశత్రులు నాగ్రంధములయందు,

దోషభూయిష్టములగు విషయములు నాపై నిందా రోపణఁ జేయుటకు, ప్రవేశ పెట్టకున్నచో, నాహృదయ పూర్వకముఁగా లిఖించిన విషయులే యందున్నచో, నాగ్రంథములు నేరచించినవే యనుట కెట్టిసందేహ మునులేదు. ఇక రెండవ ప్రత్యుత్తరముగాఁ నేవ్రాశిన గ్రంథములన్నియునొ కేరీతివిగావని చెప్పవలసియున్నది.

కొన్నిటి యందాచారము, భక్తి, నీతి, మొదలగు విషయములు చర్చించితిని. వానిని నాశత్రులే, ప్రతిక్రైస్త వుఁడునుఁ జదువఁదగినవని పొగడియున్నారు. పోపుచే నిర్మింపఁ బడి నాచే నిరాకరింపఁబడిన శాసనము సహితము, నాగ్రంథము లందుత్తమమైనవి కొన్నిగలవని యంగీకరించినది గాన యట్టి వానిని, నేనుపసంహరించుకొనిన, శత్రులచేతను, మిత్రుల చేతను, నంగీకరింపఁబడిన సత్యమును నాశ మొనరించిన, వాడను గానా?

ఇఁక రెండవ తరగతి పుస్తకములు. పాపపుమపుచీట్లచే జనులందరి యాత్మను, శరీరమును, ధనమును కొల్లగొనిన మాయావుల దుర్బోధనల ఖండించునట్టివయియున్నవి. ఈవిష యము జనులెల్ల రంగీకరించినవే. అందు పోపు వాని యను చరుల కృత్యములు ఖండింపఁబడినవిగాన వీని నేనుపసంహరిం చుకొనినయెడల, దుర్మార్గుల దుష్కృత్యములు ప్రబలి, హద్దు లేక, స్వైరసంచార మొనరించి, ప్రజాధనరక్తములఁ గోలి శిక్షావిహీనములై యుండు. అట్టియెడ ద్రోహిని నేనేయగుట నిక్కవము. నిర్వివాదాంశము.

మూడవ రకము. మదీయసూత్రముల సిద్ధాంతమొన రించు కూర్పుల కుమతఖండన మొనరించుచు వ్రాయఁబడినవి. వానిని నే నుపసంహరించుకొనిన ప్రజా దైవవిరుద్ధానువర్తినగు పాపము నాయందు నిండి నిబిడీకృతమగునను టకే సందియము లేదు. నా సూత్రముల రక్షించుటకు ప్రభువాక్యములే యాధారములు. నాగ్రంథములయందలి దోషము లిట్టివియని యేరు సత్యవేదగ్రంథానుసారముగా నిర్ణయించినను వానినెల్ల నగ్నియందు బడవైచుటకే నే ప్రథముఁడను. నాయంతరాత్మకుఁ దేవుని వాక్యమే ముఖ్యమని తోచుచున్నది. అట్టిదానిని మాటిన నెట్టిపాపులమగుదుమో వేరుగ వక్కాణింపనేల? దేవుని వాక్యానుసారము పరిపాలనమొనర్చువారు వృద్ధిగాంతురు. దేవునికిఁ భయపడుట పరమధర్మము. ఈవాక్యములతో, తగుకారణము లేకయే, నాగ్రంథముల నుపసంహరించుకొననని, నిర్మల నిశ్చలాంతఃకరణుఁడనై మనవిఁ జేయుచు విరమించుచున్నాను. (కూర్చుండును)

ఈక్—(క్రోధముతో) మార్టిన్! నీవు ప్రశ్నకుఁ దగునుత్తర మీయవలెనేగాని వెర్రి, మొఱ్ఱి యుపన్యాసములీయ వీలు లేదు. తల తోకలేని వ్యాఖ్యానము లనవసరములు. క్లుప్తమగు సమాధానమునే మేమపేక్షించుచున్నాము.

మా—(గంభీరస్వరమున) పెద్దలగుమీ రెల్లరుక్లుప్తమగుసమాధానమునే కోరుచున్నారు. కాన సటులనే పల్కెదను వేదప్రమాణములచేతను, సత్యముచేతను నా ప్రచుర

ములు దోషభూయిష్ఠలని నిర్ణయింపఁబడునంతదనుక నాయంత రాత్మకు విరుద్ధముగా నెన్నఁడు నుపసంహ రించుకొనువాఁడనుగాను. ప్రభువు నాకు సాయపడు గాక. (నిష్క్ర॥)

ఛార్లెసు—(తనలో) ఏమి వీని సాహసము. అధికారులను, చక్రవర్తులను లెక్కఁగొనక, మోమోటమింతైన లేక యెట్టి సమాధాన మొసఁగెను. నేను చక్రవర్తినై యుండి, నా తాత, తండ్రుల రీతి పూర్వాచారముల నిలుపుదునే కాని యిట్టి ధిక్కృతి సహింపఁజాల. (ప్రకా॥) సభ్యులారా! యిప్పుడు మన కేది కర్తవ్యము?

సభ్యులు—ప్రభూ! ఆలోచించుట కేమున్నది? వాని వాక్యా నుసరణి మీరందరు వినుచుంటిరేగదా. మాయందు కృపాంతరంగులై పూర్వాచారములనిలిపి, రోమను పోపుమార్గకంటకము నూడఁబెరుకవలెను.

ఛా—(వ్రాయుట నభినయించి) మీరందరు దీనిపై సంతక ములు చేయుఁడు.

సభ్యులు—(సంతకముల చేయుదురు.)

ఛా—ఈశాసనముచే రాజ్యద్రోహిగాను, మతద్రోహిగాను, లూథరు నిర్ణయింపఁబడినాడు. ఎవ్వరెట్టి సహాయ మాతని కొసఁగఁగూడదు. సర్వులు వానిఁబట్టి యధి కారులకప్పగింప వలయునే గాని, వానికి నిలువ నీడ యొసఁగరాదు. అతఁడు ప్రచురించిన పుస్తకముల

నెవ్వఁరు జదువఁగూడదు. ముద్రింపఁగూడదు గాన వానిని త్వరలోఁబట్టు మార్గమాలోచించుము.

[ భటుడు ప్రవేశించి ]

భ—ప్రభూ! లూధర్ పట్టణమును వదలి యప్పుడే సురక్షితమగు స్థలమునుఁ జేరినాడట.

[ అందఱు నాశ్చర్య మభినయింతురు ]

సభ్యులు—పాపీచిరాయు వనుగతియయ్యెనే!

ఛా—కానిండు. మనపూన్కి నింత విడువరాదు. నేటికీసభఁ జాలింతుము.

[ నిష్క్రమింతురు— తెర పడును. ]





# మార్టిన్ లూధరు.

## పంచమాంకము.

### ప్రథమ రంగము.

[రహస్య స్థలమందున్న లూథరు]

మా—ఆహా! నాకెట్టి యపనిందరానై యున్నది. ఛార్లెస్సు యాజ్ఞకు వెరచి మిత్రులు నన్నీప్రదేశమునను౦పఁ గూళలు నన్నాపదలముంప నాసూత్రములు వ్యంగ్యములుగా దోపజేయ, యెట్టిపనులఁ జేయుచుండిరి. [ఆకసము వంకఁజూచి] ప్రభువా నీయాజ్ఞల నెరవేర్ప దృఢచిత్తుడనై, దీక్షాబద్ధకంకణుఁడనగు నాకిన్ని శోధనలఁగల్పింప న్యాయమా? [విచారముతో] ఆగష్టినియస్సు, యాలయములందలి పఠములఁ బ్రద్దలు చేసెనట. విగ్రహముల ముక్కలు గావించెనఁట. విద్యనభ్యసించిన లాభములేదని బోధించుచుండిరట. ఏమి

యన్యాయము. దీని నెవ్వరాపఁగలరు. [క్రోధముతో]
కూళలారా! నేను లేకునికిఁగదా మీరింత స్వైరవిహార
మొనరించుచుండిరి. నా ప్రాణములకైన తెగింతునుఁ
గాని మీదుర్బోధనల సాగనిత్తునా? [విచారముతో]
రహస్థలమునుండి బయలుపడుదునా! లేక దుర్మార్గము
సాగనిత్తునా? మరలఁ జ్ఞానస్నాన మిచ్చువారమని,
థామస్‌మన్‌జర్ యను వాఁడొకఁ సంఘమును
బయలుదీసి, యెన్నియో దుర్బోధల ప్రజలకుఁ గఱపు
చున్నాడట. ఇక నేనూరకమానము వహించిన లాభ
మేమి. సత్యవాక్యపరిపాలనమా లేక నాజీవితమా
నాకెక్కువ? దేవుని యానతి మీరఁజాల. నాసోదరు
లజ్ఞానాంధకారంబునఁబడ సహింపఁజాల. ఏమయిన
నగుఁగాక.ఇక నాలసింపరాదు. ఇప్పుడే ప్రయాణమునకు
సిద్ధముఁ గావలయును. ఇపుడు ప్రజల సమక్షమునకు
నారాకయే ముఖ్యమైనది.

గీ. ఆకసము భూమి నేకమై నలరుఁగాక
సప్తవార్ధులుఁ ఘూర్ణిల్లి నమయుగాక
తారకావళి నడువీధిఁ దరలుఁగాక
ప్రాణమైననుఁ దెగియించి పయనమగుదు.

భటు—అయ్యా! మీకొక జాబు. (ఇచ్చును.)

మా—(విప్పి చూచి) నామిత్రులు నన్నీప్రదేశమునుండి కదల
నలకనుచున్నారు. ఇందు విటెన్బర్గునందు జరుగుచున్న
విషయములన్నియు సవిస్తారముగా వర్ణింపఁబడినవి.

ఫ్యాకుజార్జి నాకు వ్యతిరేకముగా నేరములఁ బన్ను చున్నాడఁట. నాపై నొక క్రొత్తపథము నెత్తి శతువ్రులు నెమకుచుండిరఁట. మరల లెంటుదినములలో జరుగఁబోవు సభపరకైన నాగవలెనని ఫ్రెడరిక్కుప్రభువు సలహా నిచ్చుచున్నాఁడు. ఏమి చేయనగు. ప్రయాణోన్ముఖుఁడనైన నే నీతలంపుల మనమునఁ దలపెట్టరాదు. ఈలేఖ యిదివరకందిన బాగుండెడిది. ఇప్పుడాగుట దుస్సాధ్యము. ఇఁక త్వరితముగా ప్రయాణము సాగించెద.

(నిష్క్రమించి పునః ప్రవేశము.)

ఇప్పటికి ప్రయాసముమీద జేనాపట్టణముఁ జేరగల్గితిని. ఈసత్రమునందీరాత్రి వసించెద. (సత్రములోనికేగును)

[ ప్రవేశము: జాణ్ కెస్లర్, స్పెణ్గ్లర్ అను స్విస్సు విద్యార్థులు ].

మా—మిత్రులారా! సాధువాదములు. ఇచటికి దయచేసి, వెట్టకలుగఁటకై పానీయములఁ గ్రోలుఁడు. మీరు స్విస్సుదేశీయులుగా కానంబడుచున్నారే? మీరే దేశమునుండి యేదేశమున కరుగుచున్నారు?

కె—అయ్యా! మేము గాలుదేశమునుండి పయనమై విటిన్బర్గునకు పోవుచున్నాము.

మా—విటిన్బర్గునకా? మీరట మంచి హితులను సంపాదింపగలరు. ఆగస్టైను చాలమంచివాఁడు.

కె—వారికై మావద్ద జాబులున్నవి. అయ్యా! లూథరిప్పుడు విటిన్బర్గునందున్నాఁడో మరిమెచటనున్నాఁడో చెప్పగలరా?

మా—అతఁ డింటివద్దలేడని తోఁచుచున్నది. కాని త్వరలో రాగలఁడు. మీరు వేదగ్రంథము చదువనెంచినయెడల, గ్రీకుభాషనేర్పుటకు మెలాంక్తన్, హీబ్రూభాష నేర్పుటకు ఆరోగలస్సు యచటనేయున్నారు.

కె—లూధరు త్వరలో రాగలఁడను వార్తవినినందులకు ప్రభునకు వందనములు. దేవుఁడు మాకాయుర్దాయ మొసంగునెడల వారినిఁ జూచువరకు మేము విశ్రమింపము. వారి కొరకే మేమటకుఁ బోవుచున్నాము. అతను క్రీస్తులను తీసివేయదలంచుచున్నాఁడని విన్నాము. దానికి హేతువు లెవ్వియో వినగోరుచున్నాము.

మా—మీరిదివరకెచట విద్యనభ్యసించితిరి.

కె—బేసెల్ నందు.

మా—బేసెల్ నందా! అచట యఱ్ఱస్మసున్నాఁడా? అతఁడేమిచేయుచున్నాడు?

కె—అచటనే యున్నాఁడు. కాని యతఁడేమి చేయుచుండునదియు నెవరికిఁ దెలియదు. అది పరమరహస్యము. (లూధరు పానీయములఁ గ్రోలుచుండ తనహితునితో రహస్యముగా) ఇంత లాటిన్, హిబ్రూ, గ్రీకు, భాషల నెఱిఁగిన వానినెక్కడ నెరుఁగను.

మా—హితులారా! స్విడ్జరులెండులో లూధరునుఁ గూర్చి యేమనుకొనుచున్నారు?

కె—ప్రతిదేశమందువలెనే యచటను తలంచుచున్నారు. కొందరు సత్యమును బయలుపఱుప నవతరించిన

వాఁడనుచున్నారు. చర్చియధికారులు దుర్మార్గుఁడను చున్నారు.

మా—దుర్మార్గమును బోధించు చర్చియధికారులంతకన్న నేమనఁగలరు.

స్పె—(ఒక పుస్తకమునుఁ దీసి) ఈభాష నేర్చుకొనవలెనని నాకెంతయో నభిలాష.

మా—దానిని నేర్చుకొనుటకుఁ జాలకష్టించవలెను. నేనును ప్రతిదినము కొంతనభ్యసించుచున్నాను.

[చీకటిపడుటచే సత్రాధికారి దీపము వెలిగించును.]

సత్రా—అయ్యా! మీరు లూధరునుఁ గూర్చి మాట్లాడుట వింటిని. మీరిటకు రెండురోజులకు పూర్వమరుదెంచిన బాగుండెడిది. అప్పుడాయన యీబల్లమీదనే కూర్చొని యుండెను. [లూధరు కూర్చున్న బల్ల చూపును.]

స్పె—ఈచెడుగాలి మమ్మాటంక పరుపకున్న మేమానము యమునకే నిటకేగుదెంచి యుండెడివారము. ఎంత దురదృష్టవంతులము.

కె—అతఁడరుదెంచిన ప్రదేశమును, యతఁడుపవిష్టుఁడైన యాసమయమును చూచుటయైన లభించినందులకు వందనములు.

సత్రాధి—నవ్వుచు లూధరు ముఖమున కడ్డముగా పుస్తకముంచుకొనియుండుటచే కెస్లరుకు సంజ్ఞచేయఁజాలను దాపుకువచ్చును.) మీరునిక్కువముగా లూథరును

చూడఁగోరియు, మాట్లాడఁగోరియు నుంటచే నేను సత్యము వచించుచున్నాను. ఇప్పుడాకూర్చున్న వాడే లూధరు.

కె—మేము లూధరును కోరుచుండుటచే నటులబల్కుచుంటివే గాని నిక్కవము కాదు.

సత్రా—కాదు కాదు నిక్కముగా నాతఁడే. మీరతని నెఱింగి నటుల నటింపఁకుఁడు. (నిష్క్రమించును.)

(కెస్లరు తిరిగివచ్చి మిత్రునితో రహస్యముగా)

కె—సత్రాధికారి యీతఁడే లూధరని నాకుఁజెప్పినాఁడు.

స్పెక—నిక్కవమగునా? హాటన్ననియుండవచ్చును. ఇతని వద్ద యోధునిరూపమేగాని సన్యాసిరూపము లేదు.

(ఇద్దరు నగ్గకు లరుదెంచి విశ్రమింప నంగొకఁడొక పుస్తకమును చదువును.)

మా—మిత్రమా మీరు చదువునదేమి పుస్తకము?

వర్త—లూధర్ యుపన్యాసములు ఇప్పుడే ముద్రణము నొందినవి. మీరు చూడలేదా!

మా—లేదు త్వరలో చూడఁగలను.

సత్రా—అయ్యలారా! భోజనము వేళయైనది. దయచేసి కూర్చుండుడు.

మా—మిత్రులారా! యిటుకూర్చుండుడు. (భోజనము చేయుచు) అయ్యలారా యివి చెడురోజులు. జర్మనుల చింతలఁదీర్చుటకు, మతవిషయములు విచారించుటకు న్యూరెంబర్గువద్ద రాజులు పెద్దసభలు సలుపనున్నారని క్రొత్తగావింటిని. వారేమిచేయుదురు. తిని త్రాగి

కాలము సుఖముగా వెళ్లబుత్తురు. మన సంతతివారై
నను క్రూరకార్యములకు లోనుగాకుండ ప్రభువును
ప్రార్థింపవలయును.

వర్త—అయ్యా నేను నిష్కాపట్యహృదయుడను. నామనస్సు
నకు బూధరు దివినుండివచ్చిన దేవదూతయని తలంచు
చున్నాను.

(గురుముల మేపుటకు పోవును.)

సత్రా—(విద్యార్థులతో) మీరు నాకేమియు ద్రవ్యమీయ
నవసరములేదు. బూధరంతయు నిచ్చినాడు.

కె—అయ్యా నమస్కారములు. నేను హాబెనుతో మనవిఁ
జేతునా?

మా—నేనాతఁడనుకాదు. (సత్రాధికారితో) నన్నిరాత్రి
గొప్పవానినిఁగాఁ జేయుచున్నారే.

సత్రా—మీరు బూధరుకాని హాబెనుకాదు.

మా—(నవ్వుచు) వారు హాబెన్నని తలఁచుచున్నారు. నీవు
బూధరనుచున్నావు. రెండును బాగే. సరియేకాని
సత్రాధిపా!మంచిద్రాక్షారసమును తెమ్ము. (త్రాగును)
మిత్రులారా మీరు విబెన్బర్గుఁజేరఁగనే నన్ను స్మరిస్సు
నకు జ్ఞాపకముఁజేయుఁడు.

కె—ఎవరని జ్ఞాపకముఁజేయము?

మా—రాబోవునతఁడు కుశలమడిగినాడనుఁడు. (నిష్క్రా॥)

[తెర పడును.]

## ద్వితీయ రంగము.

---

(మార్టిన్, అతని మిత్రులు ప్రవేశము.)

మా—మిత్రులారా! దేవుని కృపచేతను, మీయాశీర్వచన ప్రభావముచేతను, తులువలొనరించు దుర్బోధనలకు ప్రజలు చెవియొగ్గకుండఁ జేసితిమి. 8 యుపన్యాసము లొనరించితి. ప్రజలు శ్రద్ధాళువులై యాకర్ణించిరి. దుండగీడులు నిలువఁదావులేక కాలికిఁ బుద్ధిఁజెప్పిరి. ఇక పోపాసంగెడు వేదవిరుద్ధాజ్ఞలు సాగవు. పోపు శాసనధిక్కారమొనరించుటకు ప్రథముడ నేనే. పోపు మతప్రకారము వైదికోద్యోగులు వివాహమాడరాద నుట కడుహేయము. తిమోతియో నాల్గవయధ్యాయమునందలి మొదటి మూడువచనములే వారు సెప్పెడుదానిని ఖండించుచున్నవి.

సీ. సర్గ రమనునట్టి సాగరంబునుఁదాట
తరణి యీజగతిలో తరుణిగాదె
ఐహికాద్యఖిల సౌఖ్యంబుల నందంగ
జీవయాత్రనుఁగూర్చు చెలువగాదె
కష్టంబు నిసుమంత గాంచకుండఁగఁజేయ
యంత్రమీజగతిని యతివగాదె
దుఃఖంబు నిసుమంత దోపకుండఁగఁజేయు
మూలమీభువిలోన ముగుదకాదె

గీ. దలఁప నన్యోన్యరాగంబు దవిలివసుధ
సంతతంబును సంతోష సరసిఁదేలు
చున్నదాంపత్య సౌఖ్యంబు లెన్నఁదరఁ
నహహాభూలోక స్వర్గమయ్యదియెగాని.

శా. ఇల్లో, ముంగిలియో, యనుంగుఁ జెలులోయీాడైన
చుట్టంబులో। నిల్లాలో కొడుకో దరింపవశమే యేపోడు
ముల్లేక నా॥ కల్లావాక్యములాలకించ ఫలమాకార్యంబు
లేమాను నా। యుల్లాసంబగదీరనింతనొకతేఁ యుద్వాహ
మేనాడెదఁ.

ఇందున మీాయుద్దేశ్యమేమియో నెరుంగఁగోరుచున్నాను.

1 మి—గీ. కష్టసుఖముల నీడయిగాచుచుండి
యెల్లపనులను నెరవేర్చియుల్లమరల
సంతసంబును గూర్పంగజాలునట్టి
సుదతిలేనట్టి గేహంబు శూన్యమగును.

చ. వలదువివాహమంచని సపారముగా నిహసౌఖ్య[illegible]ముల్తై
తులువలు చాటుమాటులను తుచ్ఛములౌబనులెల్లసేయు
చున్। దలఁపముస్త్రీలనైన కడుధన్యులమంచువచించు
కంటినీ। చెలువునతినింగొని యచింత్యసుఖంబు ఁనొంద
రాదొకో.

2 మి—ఇంకను రహస్యముగా ముచ్చటించుచుంటివా? రహ
స్యముగా నుండుకాలము గతించినది. వీరిదు ర్మార్గము
లెరుఁగనిదెవరు?

సీ. అష్టమయిన సెంటు యతివ్యభిచారియై
పదునాలుగుతనయులఁ బడయలేదె
నారవ యలగ్జాండ రతివ్యభిచారియై
పోపు పుణ్యుడటంచు తోఁపలేదె
కర్డినాలులసొత్తుఁ గ్రహింపనెంచియు
విషమిాయ సుతునకు వినఁపలేదె
తా నె వానినితిని తరలె నీభువినుండి
యిట్టివారలుగాదె శిష్టులగుట
గీ. నటుల యొనరించి పాపముల్ దిటవుపరచి
యేహ్యా గుణయుతులగు పోపు నింగితములు
మనము విడువంగవలెగాని వినఁగ రాదు
లూధ రుద్వాహమైనను బాధలేదు.

మా—క్యాతరిన్ యనుకన్యను వివాహమాడ నెంచితిని. కాన మిారందరు నేఁడు చర్చికిఁ దయచేసి నాసంతసము నందు పాల్గొనఁగోరుచున్నాను.

మిత్రు—అటులనే సఖా. [నిష్క్రమి]

(తెర పడును.)

---

తృతీయ రంగము.

(ప్రవేశము: మార్టిన్ యాతురతతో)

మా—ఎవరురా నక్కడ.

భ—అయ్యా యేమియాజ్ఞ.

మా——నీవు సత్వరముపోయి హాంభష్టునిఁ గొని తెమ్ము.

భ——అటులనే [నిష్క్రమించి మంగలితో ప్రవేశించును.]

మం——ఆర్యా! నన్నింత త్వరగా రావించిన కారణమేమి?

మా——[హేళనముగా] పవిత్రుఁడగు పోపుయొక్క యుద్యోగి యరుదెంచెనట. నేను వారితో మాటాడవలయు. సత్వరము నీపని నీవుగానిమ్ము.

మం——అయిన క్షురకర్మయెందులకు.

మా——ఓరి పిచ్చివాడ! యింతమాత్రము తెలియదా. నేను వారికి కురవానిగాఁ గాన్పించిన యిట్టిబుడుతఁడే తమ కెంతయో వ్యతిరేకములొనరించిన, నికముందెట్టి కష్టములఁ గలిగించునోయని భయపడుదును.

మం——[నవ్వుచు పనిచేయును. పూర్తియగును.]

మా——ఎవరక్కడ? నాకు మంచివస్త్రములు, బంగారు మెడ గొలుసు తెమ్ము.

భ——(తెచ్చియీయఁగా ధరించును)

మం——అయ్యా యీవేషముఁజూచిన వారు తమను హేళనఁ జేయుటకే తెంచినారని తప్పుపట్టుదురేమో?

మా——(చిరునగువుతో) అందుకొరకే, నేనిటులనే పోయి తీర వలెను. వారు మాహృదయముల మిక్కుటముగ గా యపరచిరి. మేము మావంతు తీర్చుకొనవలయును. న క్కలతోను పాములతో నుయిటులనే ప్రవర్తించవలయును.

మం——ప్రభువు మిమ్మురక్షించుగా. పోయిసేమముగా రండు:

(అందరును నిష్క్రమింతురు తెరయెత్తగా పోపునుద్యోగులుందురు)
(రంగము: భోజనశాల)

జాన్ మెట్సిఁక్—విటెన్బర్గు ప్రముఖులగు లూధరువారే గిబ్యర్ హేజిక్ గారు వీరు. వీరు పాష్టరులు (లూధరు వంకతిరిగి) అయ్యా వీరు శివ పాలుగారిచే పంపఁబడిన మాపై యుద్యోగులు

మా—(దేశాచారవిరుద్ధముగా టోపీనితలనుండితీసి) మీకు కుశలమా? మీరు శివ పాలువద్దనుండి వచ్చినారన్న మాట

వర్.జీరిరో—మన మీబల్లమీదకూర్చుందమురండు (ద్రాక్షా రసము త్రాగును)

మా—(కొద్దిగ త్రాగి) మీరుజర్మనీ ప్రవేశింపక పూర్వము, లూధరున కెల్లప్పుడు త్రాగుటయేపనియని వినియుందు రని నమ్ముచున్నాను.

వర్—విద్యాధికుఁడా! అటులనే వినియుంటిని. నేనాహ్వానిం చిన యింగ్లీషుదేశస్తుడు రాకుండుట చాలా విచార కరము.

మా—ఓహో! అతను హెన్రీరాజుయొక్క నాంతరంగిక సెక్రిటరీ. మాకొరకు రాయబారిగా పంపఁబడినాడు. రాజుగారు కొంతమంది బిషప్పులను చంపెనని చెప్పెను. నూరుగురైనను విషాదము లేదంటిని.

వర్—అతఁడొనర్చిన కార్యమును మీరెట్లుమెత్తురు? వైదికో ద్యోగుల చంపుట న్యాయమా?

మా—అటులఁ జేయుట కొంచెము కష్టమే.

వర్—[పండ్లుకోరికి కోపము నటించును.]

మా—అయిన నింగ్లాండు నాకు సాయపడి ప్రొటెస్టెంట్లు కాపాడును.

వర్—ఆతని వాక్యములచేతను, లంచములచేతను, మీరు మోసపోకుఁడు. మనలో మన మంతఃకలహములుంచు కొనుటకంటె నొకేకారణమునకై పోరాడుట మంచిది. (కొంచవరాగి) ఇక్కడ ప్రీస్టుల నభిషేకించుటకు బిష ప్పులు లేరుగదా ఎట్లు జరుపుచున్నారు.

మా—(బ్యుగెర్ హేగెర్ నుచూపి) ఆపనికై నియోగింపఁబడిన బిషప్ యీతఁడే.

బ్యుగెర్—అపోస్తులుఁడగు పౌలుచెప్పిన విధానము ననుస రించి మేము పాస్టరుల నభిషేకించుచున్నాము.

వర్—(అసూయతో) అటులనా?

మా—మేమటుల నాచరింపక తప్పనివిధియైనది.

వర్—తప్పక విధియననేమి.

మా—రోమన్ బిషప్పులగు మీరుమాకుమిక్కిలి పవిత్రులు. మీరభిషేకింపరు. కాన మాయాత్మల రక్షించు కొనుటకు మేమేయిటులాచరింపవలసి వచ్చినది.

వర్—ఇచ్చటిప్రీస్టులు బ్రహ్మచర్యము కంటె వివాహమా డుటే యుత్తమమని తలంతురు గాబోలు.

మా—అవును. ఇచ్చటివారొక భార్యకు మాత్రమే భర్తలు గాని పలువురకుఁ గారు. నాకును నన్మార్గాను వర్తిని

యగు నొకభార్యగలదు. ముగ్గురు కుమారులు. ఇరువురు కూతురులున్నారు. పెద్దవానికి నవవర్షప్రాప్తియైనది. నాయనంతర మాతఁడే లూధరు మతస్థాపక ప్రవక్తయని నమ్మచున్నాను.

వర్—అతనికుపవాసముండుట నలవరిచితివా?

మా—పోపాజ్ఞాపించినను, యట్టుల చేయువాఁడనుఁ గాను.

వర్—పరమ పుణ్యాజనకుఁడగు పోపు చెప్పినాడనియేనా చేయకుండునది?

మా—అవును. చక్రవర్తియాజ్ఞయైన శిరసావహించి గౌరవింతుము.

వర్—నీవు చెప్పునది సమంజసముగా లేదు. చక్రవర్తినహితము, పోపాజ్ఞవిరుద్ధాను వర్తిగాడు. పోపే చక్రవర్తి నభిషేకించును. ఇప్పుడు నీవు దూషించిన పోపే సంఘము నొకదాని నేర్పరచిన నీవద్దానికి రావా?

మా—సరియయిన సంఘమయినఁ బాగుండును. అదియయినను, సత్యమెఱుంగనివారికేగాని మాకేమి యావశ్యకము. మీసాంఘికులు, నిజమగు పశ్చాత్తాపము, సత్యము, భక్తి, మొదలగు విషయములే మరుతురు. తప్పుతోవలఁబోవుమీరుసంఘమువలన బాగుపడుదు.

వర్—లూధర్ నీవు మాట్లాడుచున్న దేమి? అనవసరప్రసంగము లెత్తకు. నీవును మానవపుత్రుడవే. సర్వమెరింగిన పోపుకన్న ఘనుఁడనని భావింపకు. నీమూఢత్వమే నిన్నిట్లాడించుచున్నది.

మా—(రోషముతో) ఏమి? నాదా! మూఢత్వము. నాకో
పము ప్రభుకోపమని నిశ్చయముగాఁ జెప్పఁగలను.
వర్—నీవు సభకు వచ్చెదవా?
మా—నాతలపోయినను సరే తప్పక వచ్చెదను.
వర్—సభ యెటనిర్ణయించు నీకిష్టము?
మా—నాకెచ్చటనయిన నొకటే.
వర్—పోపైనను విటిన్బర్గునకు వచ్చుటకు సంశయింపఁడు.
మా—రానిమ్ము. అతని గౌరవముగా నాదరింతుము.
వర్—సైన్యసమేతుఁడై వచ్చిన?
మా—ఎటులైనసరే.
వర్—నేటికిక పోవుదము. (నిష్క్రమి॥)

(తెర పడును.)

---

## తురీయ రంగము.

(జర్మనీనగరము పౌరులు, నితరులు, ప్రవేశింతురు.)

1 పౌ—ఆహా! లూధరు మనస్థైర్య మెంతని కొనియాడ
వచ్చును. అష్టమహెన్రీ యాజ్ఞసహితము సత్యవిరుద్ధ
మైన తృణీకరించెఁగదా!
2 పౌ—ఆర్యా! ఆజ్ఞయేమి? తృణీకరించుటయేమి?
3 పౌ—నీకింకను తెలియదా! కూపస్థమండూకములన నిట్టి
వారే. అష్టమహెన్రీ తన భార్యను పరిత్యజించుటకు
రోమకచర్చివారొప్పుకొననందున, లూధరైన తన

సిద్ధాంతమును బలపరచునేమోయని దలఁచి యొకక
పరుప, లూథరొప్పుకొనలేదు. తెలిసినదా?

2 పౌ—ఆహా! ఎంతటి సత్యమూర్తి.

సీ. శ్రీసంతతులవెన్కఁ జెరవచ్చుచునుండ
సత్యంబుఁదప్పని సద్గుణుండు
రాజాధిరాజులు రావించి దనువేడ
ధర్మంబుఁదప్పని నిర్మలుండు
కూళలుదనుఁజంపఁ గోరివేచియునుండ
తెంపరియైచేరు ధీయుతుండు
ప్రభుజీవనముకన్న ప్రబలమేమనజీవ
మని శత్రులంజేరు యనఘమూర్తి,

గీ. సత్య మార్గానువర్తి, సుజ్ఞానస్ఫూర్తి
సంతతానందమూర్తి విశాలకీర్తి
లూథలార్యునిబోలంగ లోకులకును
శక్యమగునొక్కొ భవ్యుఁడౌ సజ్జనుండు.

ఇట్టి ధైర్యశాలిమనకిక లభింపఁబోఁడు. దేశదేశంబుల
సత్యవేదజ్ఞానము వేరులునాటినది. ఇక వృక్షమైపలించునను
టకే సందియములేదు గాని, యీమహానుభావుఁడు తానాటిన
వృక్షఫలములఁ జూచునో చూడడో. (కన్నుల నీరుగార్చును)

3 పౌ—ఏమి యట్లనెదరుఁ.

2 పౌ—ఈమధ్యనాతనికి దేహమస్వస్థత గలిగి మరల కొంచ
మునెమ్మదిగా నున్నదఁట. కాని మానవుఁడు సర్వ
కాలముఁ జీవించువాడు కాఁడు. లూథర్ కూడ పెద్ద

వాడయినాడు. పెక్కు కష్టము లనుభవించినాడు. మనమందరముఁ గూడి వారి కాయురారోగ్యముల నొసగఁ బ్రభువును బ్రార్థింతము రండు.

(అందరు మోకరించి తలలువంతురు.)

సీ. మరియమ పుత్రుఁడై మహినిజన్మించియు
సత్యమతంబునుఁ జాటెనెవఁడు
పదిరెండు శిష్యుల పతితులఁగావించి
దీనుల రక్షించి దివిరె నెవఁడు.
తన దేహమును బాసి, ఘనశిల్వపైనను
నజ్ఞాంధకారంబు నడపెనెవఁడు
పునరుద్ధానముఁగాంచి తన శిష్యులకు ధైర్య
మొనఁగూర్చి సత్యమున్ననె నెవఁడు
గీ. అట్టి శ్రీయేసు, ధీమహామాంచితుండు
మాదు ప్రార్థనలాలించి మహినితనదు
భక్తుఁడగు లూధరునకును పరగనిచ్చుఁ
గాక, నారోగ్య, మాయువుఁ గరుణమీర. ఆమెన్

(నిష్క్రమింతురు.)	[తెర పడును.]



పంచమ రంగము.

(రోగపీడితుఁడైన లూధరు, జోనస్, అరు ఫేబర్, కోలిఙావ్, మార్టిన్ పాల్, మరికొందరుందురు.)

మా—ఆహా! హృదయమేమో భారముగనుండి పైనేదియో బరువుపెట్టినట్లున్నది. మిత్రులారా దీనికేదైన షుప

శాంతి చేయలేరా.

1 వి:—(వేడినీటిలో గుడ్డముంచి కాపుకాయును.)

మా—అయ్యో! యిదియేమి. నాకన్నులకేదియో దివ్య తేజము గోచరించుచున్నది. వేయిమంది భాస్కరు లొక్కపరి నుదయించినట్లున్నది. ఓహో, హో

కోలియస్—మిత్రమా! అటుల పిచ్చి పిచ్చిగా మాట్లాడెద వేమి. ఇచ్చట నేమియులేదే. తేజమెక్కడ. మనస్థిమితముగా బరుండుము.

మా—ఆహా! ఆహా! ఏమాదివ్యమంగళ విగ్రహము, తండ్రీ! ప్రభువా! హతభాగ్యుఁడనగు నన్ను దోకొనిపోవచ్చితివా?, నీవే వచ్చితివా? ధన్యోస్మి ధన్యోస్మి (కన్నులు మూయును)

కోలి—మిత్రులారా! ఏమిది. మతిభ్రమా! లేక ప్రభుదర్శన మిచ్చుచున్నాఁడా?

మా—మతిభ్రమయా? ఎవరికి? మీకా?నాకా?అదిగో బహ్మాండమంతయు నావరించుచున్న నా తేజః పటలిగాంచుడు. (లేవనుంకించి) ప్రభువా రమ్మని హస్తముల జాచుచుంటివా. దీనజనావనావనుఁడవగు నీవుండ నాకే కొరఁత!

సీ॥ నాస్నేహమదినమ్మి, నిక్కమ్ముఁదెలుపంగ
పోపుతో కలహంబు బూనినాఁడ
కష్టజాలంబులుఁ గలిఁగిన విడువబోక
సత్యంబు ప్రజలకు సాటినాడ

పంచమాంకము.

వెఱ్ఱివీఁడనియెంచి, విఱ్ఱవీగెడువారి
యౌన్నత్యమెల్లను నడపినాథ
తుదిరంగమున నిన్నె మదినుంచినసువులఁ
బాయఁగానుంటిని భవ్యచరిత
గీ. మీదు కరపల్లవంబుల బాదుకొనిన
నాదు నాత్మకు నాశంబులేదు ప్రభువ
నీడ సూర్యునియట్టుల నియతిమీఱ
నన్నుఁ దరిజేర్చుకొనుమయ్య సన్నుతాంగ.
తండ్రీ నాయాత్మను నీకర్పణ మొనర్చుచున్నాను.

[ శయ్యపై మేనువాల్చి కనులుమూయును, ]

( ప్రవేశము దేవదూత )

మీరెవ్వరు? దుఃఖింపఁజనదు. ఇతఁడొనర్చిన దిద్దుబాటు చిరస్థాయియగునట్లొనర్చి ప్రభుప్రేమకు పాత్రులుగండు. ఈతఁడు తనపని ముగించి ప్రభుసన్నిధానమునకుఁ జనుచున్నాడు. కింకర్తవ్యానుమూఢులై యుండక సత్యమును జాటుఁడు.

[ దేవదూత నిష్క్రమించును. ]

[ఆధరుని సమాధికిఁగొనిపోయి, సమాధిఁజేసి విజయగీతములు బాడుచుందురు.]

సర్వము సంపూర్ణము.



